సాహితీ సమితి గ్రంథ పరంపర

# ఇహపరములు



ఖండకావ్య సందోహము



## వావిలాల రామమూర్తి

మూడు రూపాయలు

162



జననము : 9-4-1923;

తండ్రి : జాలరామయ్య;

తల్లి ; తులసీదేవి;

ధర్మపత్ని : దుర్గాంబ;

సంతానము :

చి॥ సౌ॥ జయలక్ష్మి;

చి॥ గురుచరణదాసు;

జన్మస్థలము : రుద్రవరము -

ఒంగోలుతాలూకా, గుంటూరుజిల్లా.

విద్యాదికము : భాషాప్రవీణ (1955); బి. ఎ., (1965)

అభిరుచులు : కవిత్వము, కావ్యవిమర్శనము, వ్యాకరణము.

ఇతర కావ్యములు (అముద్రితములు) :

ఇహపరములు (రెండవభాగము) - మూర్తిత్రిశతి

ప్రేమలహరి - విమర్శనవ్యాసములు

పాండురంగ మాహాత్మ్యము - తృతీయాశ్వాసము

(సమగ్రవ్యాఖ్య)

అభిమానము : ఈఁత, చదరంగము (Chess)

---

—: ప్రాప్తిస్థానము :—

**వావిలాల రామమూర్తి**

సాహితీసమితి - కొత్తపేట, ఒంగోలు (గుంటూరుజిల్లా)

# ఇహపరములు ఇత్యాది

## (పద్య కావ్యములు)

వావిలాల రామమూర్తి

స్వర్ణోత్సవ ముద్రణము

*(1919-1968)*



సాహితీ సమితి, ఒంగోలు

ప్రథమ ముద్రణము - 1968

ప్రకాశనము ; వావిలాల రామమూర్తి
సాహితీ సమితి, ఒంగోలు.

మూల్యము : రూ. 3-0-0

ముద్రణము : జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్,
బ్రాడీపేట. గుంటూరు.

5

ఈ నా కావ్య సందోహ రూపమున విద్వదాంధ్ర
కవిలోకమున కంజలించుటకుఁ గారణభూతులైన
పెద్దలకు నమస్సులు.

---

చదువుల్ గల్గియు సాటివారి ఘనతన్ సైరించువార్ కొద్ది, సై
చు దశం గాంచిన సాయమున్ సలుపు విజ్ఞుల్ కొద్ది, సత్పాండితీ
సదయత్వంబు లుదారతా ప్రతిభలున్ సంధిల్లి, సత్కీర్తికిం
గుదురౌ మేటిరసజ్ఞు నెంతు మదిలో గోపాలరెడ్డిప్రభున్.

* * *

ఎంతటి కోవిదాగ్రణికి నింత పచించు మనీషి, సాహితీ
చింతనమే ఘటించెడి ఋషిప్రవరుండు, నజాతశాత్రవుం
డెంతటి వాఙ్మయాలొ మథియించిన దిట్ట, పరోపకారమే
స్వాంత మెఱింగినట్టి శివశంకరులన్ దెలతున్ మహాకవిన్.

* * *

మానితకోవిదోత్తముఁడు, మంజుగుణాఢ్యుఁడు, భవ్యవాఙ్మయ
శ్రీ నిధి, కావ్యజాల సువిశేష సమాదరణైకబుద్ధి రా
మానుజ రాయవర్యుఁడు సమంచిత దేవులపల్లివంశ్యుఁ డా
ధీ నిధి సాయ మొంచి వినుతింతు రసగ్రహణైకశీలునిన్.

* * *

చెలువుల్ జీవనదాయినుల్, శ్రితజన క్షేమోత్థమూర్తుల్, జగా
మెలుఁగుల్ గూర్చుచుఁ జక్రరాజమును గంభీరమ్ముగాఁ ద్రిప్పు, నా
తెలుఁగున్ శీఘ్రమునన్ వహించు శితబుద్ధిన్, వాగ్మి, నీతిజ్ఞుఁ, బ
ల్మెలు కీర్తింతుఁ బరోపకారచణు, సుబ్రహ్మణ్యా ధీమన్మణిన్.

అన్నయి గురువయి సంస్కృత
మన్నది నా కింత నేర్పినట్టి మహా వ్యు
త్పన్నమతి వేంకటేశ్వరు
సన్నుతి చేసెదను దర్కశాస్త్ర మనీషిన్

* * *

పండితుని భారతుల మా
ర్కండేయ మహాకవిం బ్రగతిశీలు, గురుం
గొండాడెదఁ గావ్య కళా
ఖండ సునాటక కథానికా కర్త నిలన్.

* * *

నాకుఁ గూర్చెడు నాప్తరత్న మయి, యెపుడు
ధర్మపథమున నడచు తత్త్వంబువానిఁ
బ్రథితు నుప్పలపాటి సద్వంశదీప
కళిక గోపాలకృష్ణయ్యఁ దలఁతు నెడఁద.

* * *

ముద్రణముపట్ల నెంతో నిర్నిద్రబుద్ధి
యోర్పు పాండిత్యమును వలయును, గుణియయి
మసలు ముదిగొండ శ్రీ చంద్రమౌళివర్యుఁ
జిత్తమున నెంతు - తత్ శివశ్రీ విభూతి.

— ౧౧౧ —

7

# అంకితము

"భక్త రక్షణార్థము శ్రీశైల మహాక్షేత్రమున
భ్రమరాంబా మల్లికార్జునులుగా వెలసిన
పార్వతీ పరమేశ్వరులకు

౧

నీపయి భక్తి రక్తి హవణిల్ల, పితాదులు కోపతాపముల్
దాపునఁ జేరనీయక యెదం బదిలించి మలంచి పూజలన్
మాపుల రేపులన్ సలిపి, మ మ్మిడిపోయిరి నిన్నుఁజూపి, మా
పాపముపాప తేపవు శివా! దయఁజూడవయా, మమున్ భవా!

౨

జపముల్ సల్పఁగ శక్తి చాలదయ; సంసారంబు మా నెత్తిపై
కృపణత్వంబున లాస్యమున్ నెఱపు, నీకున్ మాకుసంబంధముల్
కపిమార్గంబున నిల్పుకో దృఢత మృగ్యంబయ్యె, శంభూ; హరా!
కృపతోఁ బ్రోవఁగదయ్య యీ యిహపరశ్రీ నీదె కాదే ప్రభూ!

3

అవతరించితి శ్రీశైల మందు, సామి !
ఆర్తులను బ్రోవఁగా భ్రమరాంబికాత్త
మల్లికార్జున దివ్య నామంబుతోడ -
మంజు మంజీరముగఁ గావ్యమణి వెలయుత !

6

# విషయసూచిక

౧. ఇహపరములు :

# విఘ్నేశ్వరా!

౧

నిలువుందోఁపిడి లేదపూపములు గానీ, లడ్డు గానీ, జిలే
బులు గానీ, యసలే హుళక్కి; సరెపో, పూజాపురస్కారముల్
సలుపన్ గంధములున్ జపాకుసుమముల్ సాంబ్రాణియున్
సున్న; త
మ్ములముల్ లేవు మహాప్రభూ! యెటుల సమ్మోదింతువో నాకునై!

౨

తండ్రీ! బియ్యపుఁబిండి బెల్లములచేతన్ ముద్దలం జేయఁగా
నుండ్రా ళ్లై యవి నీకు భక్ష్యములు గావే! యెవ్వఁ డీనెంచెఁబో
పుండ్రేక్షుల్ మధుగోస్తనీనవఫలంబుల్ మోదకంబుల్ - బలే
వాండ్రయ్యా మనవారు కాకలముపై వ్రాయంగ విఘ్నేశ్వరా !

3

తృణబిల్వార్క కసాలయాదులు మదార్తిం ద్రోలు నీప్రీతిభా
జన పూజాప్రసవంబు లై, కొనెడికష్ట మ్మేమి లేకుండఁ జి
క్కిన వై, మామకదివ్యచేతమును సుక్షేత్రమ్ముగాఁ జేసె, భ
క్తి నవాంకూరము లుద్భవిల్లె నిఁక ని న్గీర్తింతు నోయీ ప్రభూ!

౪

ప్రతిమంత్రము ప్రతితంత్రము
ప్రతికార్యము వే ఫలింపఁ బ్రథమముగా నిన్
నుతి సేయక తప్ప దయా
వితత సుఫలదాయ ! సిద్ధివిఘ్నేశ ! భువిన్.

౫

గజవదన ! యేకదంతా !
ప్రజార్తి హర ! చంద్రుసూడు ! పాపఘ్న ! గణ
వ్రజనాయక ! లంబోదర !
యజసురముని సేవితాంఘ్రి ! యగజాతనయా !

౬

బదరీ బిల్వ తృణార్క కాంచన కుశా పామార్గ జాతీ బృహ
చ్ఛద జంబూ కరవీర దాడిమ శమీ స్థావేయపత్రంబు లి
చ్చెదఁ గోకొల్లలు చిల్లిగవ్వయును వెచ్చింపంగ లేదయ్యె, నీ
హృదయం బెంత విశాలమో ! యడుగఁబోవే ! దివ్యభూషల్,
ప్రభూ !

౭

స్వామీ! విఘ్నపతీ! యకించనుఁడ, హృత్పాత్రంబునన్ నిస్తుల
ప్రేమమ్మే గుడమై, తలంపుల గముల్ పిష్టమ్ముగా, మోదకా
లామోదంబున నిచ్చెదం గొనుమ ! శూన్యద్రవ్యశోభా కుటి
శ్రీ మన్మందిర, మెట్లు గా నిలుతొ యర్చింపంగ నీపాదముల్?

౮

దాసుఁ డీయఁగఁ జిల్లికా సైన లేదయ్యె
నోసామి! దాసాని పూ సహింపు
దక్షుండఁ గాను బల్ దక్షిణల్ పెట్టఁ బ్ర
దక్షిణల్ గూర్తు నోయీ క్షమింపు
తండ్రి ! నీ కీయంగఁ బుండ్రేక్షువుల్ శూన్య
ముండ్రాళ్ల నిడెద నీ తీండ్రత విడు
వాసన్ననకు మందహాసంబు సమకూర్తు
వేసంబు కోసంబు నీసడిలకు

సకల పుష్పోత్కరైక వాసనలు నీవు -
సకల భూషాకలాప భాసమ్ము నీవు -
సకల వస్తువిశేష సంస్రష్ట వీవు -
సచ్చిదానందరూప శాశ్వతుఁడ వీవు.

౯

నీ బొజ్జం గని నీదు తొండముదెసన్ వీక్షించి బుజ్జాయి, తా
నై బోరంబడి యేటికో ల్లిడును; విద్యార్థుల్ నుతుల్ సేసి,యెం
తే బత్తిన్ మఱి చెంపకాయలను గుంజిళ్లన్ సమర్పింత్రు, వి
ద్యాబుద్ధుల్, ధనధాన్యముల్ గొనఁగ నిన్ ధ్యానింత్రు
సర్వప్రజల్.

# శివ స్తవము

౧

శ్రీకైలాసనివాస ! వాసవ మురారి స్తుత్య రూపాంచితా !
లోకేశా ! ప్రమథాధినాధ నిను గొల్తున్ మామక స్వాంత వా
టీ కళ్యాణకర త్వదీయ పదమున్ డెందంబు తా వేఁడుగం
బోకుండన్ భయపెట్టు మయ్య కరుణామూర్తీ! శివా! శంకరా!

౨

ఈ తాత్కాలిక భోగభాగ్యముల కెంతేనిన్ మదిం బొంగి హే
లా తారుణ్యము పాడుచేసికొని యల్పప్రాయుఁడై, వృద్ధుఁడై
నీతిం దప్పి నరుండు చచ్చు నటె కానీ యెంచఁ డీ యాతనా
న్వీతం బైన శరీరదుఃస్థితి భవానీశా ! శివా ! శంకరా !

3

లోభక్రోధ విమోహమత్సర మదా లోలాత్ముఁడం గామ మ
త్తేభం బియ్యెడఁ బట్టె నన్ను మఱి నెత్తిన్ మొట్టు రోగాలు, నే
నీ భంగాలు సహింపఁజాలఁ జెయిదోయిం జేర్చి ప్రార్థింతు, సా
మీ ! భక్తావనబద్ధకంకణ ! భవానీశా ! శివా ! శంకరా !

౪

నీరూపం బిదమిత్థ మంచు నొకఁడేనిం జెప్పఁగాఁ గల్గెనే
దారుల్ డొంకలు లేక యె ట్లగు? మహోదాత్తానుదాత్త స్వర
శ్రీ రాజ ధ్వన వేదకంధి మఱి నిర్దేశించి ఘోషింపఁగా
నీ రూపమ్మున మేర కల్గెనె భవానీశా ! శివా ! శంకరా !

౫

సామర్థ్యానఁ గవీశ్వరుండు రచనాచాతుర్య మొప్పార నెం
తే మౌనీంద్రుఁడు బుద్ధి కందినటు లంతేవాసి యాచార్యవా
క్ప్రామాణ్యమ్ముగ, భక్తు లెల్ల సఫలత్వం బందు రూపంబునన్
నీ మూర్తిన్ వివరింతురే కద, భవానీశా ! శివా ! శంకరా !

౬

నీకన్నుల్ గద సూర్య శీతకర వహ్ని వ్రాత, మాకాశమే
నీ కేశంబు, త్వదీయమౌళిని గదే నిల్చెన్ మహాపూత గం
గా కూలంకష, కాలకూటమును నీకంఠమ్మునన్ దేవతా
నీకంబుల్ గొనియాడ నిల్పితి భవానీశా ! శివా ! శంకరా !

౭

తోలున్ నెమ్మెయిఁ దాల్చి, బల్ముసలియెద్దున్ నీ వధిష్ఠించి, శ్రీ
కైలాసంబునఁ బార్వతీరమణి వేడ్కం గొల్వ నిత్యంబు య
త్కాలాపంబులలోన మున్గక మహీయఃప్రౌఢి పాలింతు వో
! లీలావిలసన్మహాప్రభ, భవానీశా ! శివా ! శంకరా !

౮

ఈ విశ్వ మ్మొకనాట్యరంగ మిఁక నీవే సూత్రధారుండ, వీ
జీవవ్రాతము పాత్రలందునఁ గథాచ్ఛిన్నంబు లే దయ్యెఁ, దా
నేవేళం జనినట్టిపాత్ర మఱి రానేరాదు, క్రొంగ్రొత్తగా
నేవేసంబును రాక తప్పదు భవానీశా! శివా! శంకరా!

౯

నానాభూతభవాండలీల లవి స్వప్నంబుల్, ప్రపంచంబునం
దేనాఁడో తలసూపె దైహికపుహాయిన్ లోక మాశించి, యెం
తో నైచ్యంబుగ మాఱిపోయె బహురీతుల్గాఁగ హృత్సీమలో
నీ నామంబును బాదుకొల్పెద, భవానీశా! శివా! శంకరా!

౧౦

మాయామేయభువిన్ బురాధిగతకర్మస్ఫూర్తిఁ గల్గున్, సుఖం
భూయాత్తంచు భవాబ్ధిలోఁ బడి సతమ్మున్ గ్రిందుమీదౌను గా
నీ, యేసౌఖ్యము నిత్యమో కనదు భ్రాంతిన్ జీవి, తత్సౌఖ్యముల్
హేయం బంచును దెల్పి ప్రోవవె, భవానీశా! శివా! శంకరా!

౧౧

కాదా నాఁడు కృతాంత దూతతతి మార్కండేయుఁ బట్టంగ రాఁ
గా దేవాలయమందు బాలుఁ డటు లింగం బంటి ని న్వేడఁగా
నాదూత ల్సని విన్నవింప యముఁ డంతన్ వాని బంధించి,తా
నీ దుర్వారమహాహతిం బడె భవానీశా! శివా! శంకరా!

౧౨

ఓగంగాధర ! శ్యామకంఠ ! యభవా ! యోసర్వలోకప్రభూ !
యో గౌరీపతి ! యాఖువాహజనకా! యోంకారమూర్తీ ! మృడా!
యో గీర్వాణనుతాంఘ్రిపద్మ గిరిజాయోషా మనోనాయకా !
యీ గంభీరభవాబ్ధిఁ దేల్పవె ! భవానీశా! శివా ! శంకరా !

౧౩

ఓ ఖండేందువిభూషణా ! సురగురూ ! యో వ్యోమకేశా ! మహే
శా ! ఖట్వాంగకరా ! నిరంజన ! పరేశా ! నిర్వికల్పా ! గిరీ
శా ! ఖద్యోత శశాంక వహ్నినయనా ! సర్వజ్ఞమూర్తీ ! సదా
యీ ఖిన్నున్ దయతోడఁ గావవె, భవానీశా ! శివా ! శంకరా !

౧౪

శ్లాఘాపాత్రమె యీ తనూవిభవ మేలా వానికై కూర్తు పి
ల్లా ! ఘోరంబగు నీతపంబు లోక కేలం బుట్టె, ఫాలంబునం
దో ఘోరాగ్ని, గళంబునన్ విష మటంచున్ బ్రహ్మచార్యాకృతిన్
నీ ఘృష్టిన్ సతిచిత్త మేఁచితి భవానీశా ! శివా ! శంకరా !

౧౫

ప్రాదుర్భావము చెంది యీ భువిని భార్యాపుత్త్రపౌత్ర ప్రపౌ
త్త్రాది ప్రేమరసైక డోలికల నొయ్యారంబుగాఁ దూఁగి, రా
ట్సాదృశ్యంబుగఁ గ్రొవ్వు కంటి కెగదట్టన్ నిన్ను గుర్తింప రో
యీ దౌర్భాగ్యులు, వారికర్మము, భవానీశా ! శివా ! శంకరా !

౧౬

అంధుల్ మానసపూజ చేయుదురు బాహ్యాలోకమే లేక, కా
మాంధుల్ కన్నులు గల్గి ని న్గనఁగలే రందందు సంసార సం
బంధాంభోనిధి మున్గి, చీఁకటుల ప్రోవై యొప్పు నీధాత్రి, దీ
నిం ధర్మాత్ము లెఱింగి కొల్తురు, భవానీశా ! శివా ! శంకరా !

౧౭

పత్రమ్మో ఫలమో! తృణమ్మొ పణమో! బ్రహ్మార్పణమ్మంచు నీ
ధాత్రి న్నిశ్చలభక్తితో నెవఁడు నిన్ ధ్యానించి యర్పించు, భ
క్త త్రాణైక పరాయణత్వ మట వ్యక్తం బౌఁ గదయ్యా! యిఁకే
మీ త్రైలోక్యజనంబురక్షకు ? భవానీశా ! శివా ! శంకరా !

౧౮

వాచాగోచర ! గోచరాచరచరవ్యాపీ ! మహాదేవ దే
వా ! చిద్రూప ! శివంకరా ! పరమవిశ్వధ్యేయ ! సద్భక్త కో
టీ చాకోర సుధాకరా ! నిటలవాటీ సుస్థితాక్షా ! సదా
నీ చేతోహర రూప మెంచెద భవానీశా ! శివా ! శంకరా !

౧౯

ఏకార్యమ్ముఫలించినం దనకుఁ దానే చేసి గెల్పొంది న
ట్లాకాశమ్మును జూచు గంతు లిడు, స్వీయప్రోన్నతిం జాటు పో
యా కార్యమ్ము ఫలింపకే తన కసాధ్యం బైన సి గ్గింతయున్
లేకే దేవునిమీఁదఁ బెట్టుగ, భవానీశా ! శివా ! శంకరా !

౨౦

లాభం బించుక లేక గొప్పయగచాట్లన్ సైచి యీలోక సం
క్షోభా గోచర పుణ్యపాపముల చిక్కుం దీసి, నిష్పన్న మ
ల్లే భక్తాళికి మోక్షసంపదను వడ్డిం గట్టు బేహారి వో
యీ భ్రూతేశ్వర ! యింతకంతగ, భవానీశా ! శివా ! శంకరా !

౨౧

ఐశ్వర్యం బది నీదునంశ మిఁక భోగాయత్త చిత్తుండ వై
విశ్వంబందున భర్మహర్మ్యముల దేవిం గూడి వర్తింప వో
శశ్వన్మూర్తి ! యశాశ్వతంబు లనియా, శాంతిన్ శ్మశానంబునన్
విశ్వాసంబునఁ జేరి నిల్చితి, భవానీశా ! శివా ! శంకరా !

౨౨

తూల న్మూఁడుపురాల నేసిన మహాదోశ్శక్తిసంపన్న ! వే
దాలం దెచ్చినఁ గావి యందని మహాత్మా ! భూరిసంసార బం
ధాలం ద్రెంచిన పుణ్యమూర్తి ! బహుళార్తత్రాణపారీణ ! యిం
తేలా, సంసృతికంధిపోతవు ! భవానీశా ! శివా ! శంకరా !

౨౩

వేత్రంబో వసుధాస్థలిం బ్రజలు గర్వీభూతులై క్రుమ్మరన్
స్తోత్రంబో భవదీయువాహనము నిన్నుం గొమ్ములం జిమ్ముచోఁ
జిత్రంబో విబుధారి కుంజరతతుల్ దుస్సాధ్యమై మించ, నో
యీ ! త్రైలోక్యనుతంబు శూలము, భవానీశా ! శివా ! శంకరా !

౨౪

భీతిం బొందక యే నరుండు పృథివిన్ వీతస్పృహుండై సదా
నీతిన్ వీడక తన్నుఁ దా నెఱిఁగి బంధించున్ మనస్సంత నీ
కాతండే నిను నిర్వికల్ప మగుబ్రహ్మానందముం బొందుఁ గా
దే! తావన్మహిమం బనంతము భవానీశా! శివా! శంకరా!

౨౫

నీవో చూడ దిగంబరుండ; వటు పోనీ, తిండి మాటన్ననో
యావత్కాలము పుఱ్ఱె చేతఁగొని భిక్షాన్నంబుకై పోదు వో
దేవా! నీకు లభించు వంటకము రాదే యైదునోళ్ళందు, నీ
కేవంకన్ క్షుధ యెట్లు తీఱునొ? భవానీశా! శివా! శంకరా!

౨౬

ఉర్విన్ సృష్టిని జేసి, పెంచి విలయం బొందింతు, నీకుక్షిలో
సర్వంబున్ ద్రుహిణాండమున్ నిలిచె నీశా! లింగమధ్యే జగ
త్సర్వ మ్మంచు శ్రుతుల్ వచించు; నిఁక భక్తశ్రేణి పూజింపఁగా
నిర్వాహాంశము ముక్తిపొందుట భవానీశా! శివా! శంకరా!

౨౭

వారున్ వీరును వాదులాడు తఱి నైశ్వర్యప్రదుం డంచు, నీ
కేరో వేసిన బీజ మంకురితమై యెన్నెని మొగ్గల్ పువుల్
తోరం బైన శలాటువుల్ పాడమె యెందు న్గూడ నొక్కండయేన్
దీరా నేఁటికి నైన పండెనె భవానీశా! శివా! శంకరా!

౨౮

రారా జాత్మసఖుండు, కామిత మహార్థంబుల్ ప్రసాదించువాఁ
డీ రేడైన జగాల నేలునతఁ డం చేమేమొ శాస్త్రాల వా
రారోపింపఁగ, వచ్చు నర్థిఁ గని, వాచ్యార్థంబులే లేక యో
యీ! రూక్షాహిని బుట్టఁ జూపెదు భవానీశా! శివా! శంకరా!

౨౯

ఏ రంభోర్వసులో సభాభవనమం దింపైన రూపాన సొం
పారన్ నాట్యము చేయ, గోపికలొ శ్రావ్యం బైన గీతాలతో
హారంబుల్ హృదయంబులున్ వరుస నీ కర్పింప, నీబూచిగుం
పే రీతిన్ వరియించి నిల్పితి భవానీశా! శివా! శంకరా!

౩౦

సౌరభ్యాంచిత నందనప్రథిత వృక్షచ్ఛాయలం దింత శృం
గారస్ఫార రసామృతాంబునిధి మున్కల్ వేసి దేవేంద్రుఁడై
పోరాదో! పదినాళ్ళుగా వలసగాఁ బోలే - మహాదేవుఁ డం
చీ రూపంబున నైనఁ బిల్వఁగ భవానీశా! శివా! శంకరా!

12

# వియోగార్తి

౧

ఎట కేతెంచితివోయి కృష్ణ ! నను నీ యారమ్మునం దుంచి, ప్రా
కట వంశీమృదు గానమాధురులఁ జొక్కంజేసి క న్త్రావమి పో
వుటయా ధర్మపథంబు? ని న్నెవదకి తావు ల్దప్పె ప్రాణమ్ము లిం
కిట కేతేరవ యేని నీ యమునలోనే దేహపాత మ్మగున్ !

౨

యమునాసైకత మందు లేవుర! యరణ్యప్రాంతమం దెందుఁగా
నమురా, శాద్వలమందుఁ జూడమురా, గానస్ఫూర్తియే లేదు, పా
దము నెత్తంగను శక్తిచచ్చినది రాధాబాధ నీ కింత య
ర్థము కాకున్నదె మాధవా ! యిటుల నారాటమ్ముఁ గల్గింతువే!

3

అదియా సంగతి పిచ్చివైక దధిఁ గొమ్మా చిట్టినాతండ్రి ! నీ
కది యిష్టమ్ముగుగా; మఱేమడుగు దధ్యన్నమ్మ? యభ్యూషమా?
యెది కైకో వలతో యొకింత యనుమోయీ ! నేను నీదాన న
న్నది యేలా మదిఁ ద్రోసిపుచ్చెదవొ కృష్ణా! యంత దౌర్భాగ్యనా?

౪

శుకసల్లాపముఁ గోకిలారుతములున్ శూన్యంబులై పోయె; ధై
నుకముల్ సైతము లేఁగలం గనక నిన్ మూచూడ మోరెత్తి మే
యక యుండెన్, యమునాతరంగ నివహవ్యాపారమే చూడ, మీ
ప్రకృతిశ్రీ యిట స్తబ్ధమై నిలిచె రారా ! వేణుగోపాలకా !

౫

విమల యమునాదరీ కుడుంగముల యందు
సుమ లతా భాసి కాయమానముల యందు
ధైనుకవిహార లస దుపత్యకల యందు
నా చెవిఁబడదు మురళిగానమ్ము కృష్ణ !

౬

వెదకితిని విశాల తమాల విటపి యంత
తిరిగితి సమస్త భూమిభృ ద్దరుల పొంత
కన్నుఁగవఁ జూడు కాయలు కాచి పోయె
పాప మనవు; కాళులు బలపములు గట్టె-

౭

నీవు లేనట్టి నను మొగుల్ నిక్కిచూచు
రట్టుచేయ మి న్నుమ్మట్టి యురమ్మదములఁ:
బెదవి విఱుచు సంధ్యాదేవి వెలితి గాఁగ
నింత తడ వయ్యె నీవు రా వేల కృష్ణ !

౮

నిక్కువము సుమ్ము, చీమ చిటుక్కు కూడ
నన్ను హెచ్చరించుచునె ప్రాణమ్ము నిల్పె:
నీవు వచ్చితి వనెడు భ్రాంతిని ఘటించి;
గడపితిని తండ్రి ! నీకయి కాళరాత్రి !

౯

పుష్పవంతులు నాడెడు పూలబంతు,
లుడు గణంబులు మసలెడు మిడుఁగురులును,
ప్రకృతి యంతయు నీటిలో వ్రాసిన కృతి
నీవు లేనట్టినాఁడు నా నేత్రసీమ !

౧౦

వమధు భూషా సర ఝ్ఝరీ గమక మేల ?
కేకి లోకైక నాట్య భంగిమ ల వేల ?
వాత పోత ప్రతతి వంతు పాట లేల ?
మురళి వాయింపుమోయి సమ్మోహనాంగ!

౧

నీ దివ్య కోమలపాద సంస్పృష్ట ధా
త్రీ తనూలత పుల్కరించె నేమొ !
నీ కమ్ర వేణుగా నాకృష్ట శిలలె యా
ర్ద్రీభూత గతిని నదించెనేమొ !

నీ శరీర మసార నీలమోహన కాంతి
వృష్టిఁ దమాలమ్ము వెలసె నేమొ।
నీ మధురోష్ఠ వినిర్గత మంద స్మి
తైక లగ్నాతసి యెసఁగె నేమొ।

కాక యీ శాదములు నిమ్నగా ప్రగతులు
నీలదేహాలు, ధవళపుష్పాలు నిచట
నిత్యనూతన మౌచు నిన్ దెలుపు టేల ?
దివ్యమోహన మురళీ ప్రదీప్త కృష్ణ!

౧౨

మురళీగాన రసామృతాంబునిధి సమ్మోదాన నోలాడి, యీ
తరుపక్షి ప్రతతీమృగాదిక సమస్త ప్రాణిలోకం బిదే
నిరవద్యఁ బగు సత్సమాధి మునిగెన్: నే నింతమాత్రంబు నీ
కరుణాపాత్రను గాక దక్కితినటే - కావంగరాదే ప్రభూ।

౧3

అమృతానంద మయావ్యయ ప్రణవనా దారాధనా యత్త చి
త్తము నీరీతిగ బాధ పెట్టుటయొకో త్వద్ధర్మ: మీ తుచ్ఛ భా
గ్యములం గూర్చి పరీక్షచేయుదె ననుం? గాకున్న నా చెంత రా
కు మటన్నన్ సరిపోదె; వంచనలు నీకుం జెల్లునే చేయఁగా!

౧౪

నా మనోహరమూర్తి
కేమొ తప్పొనరింప
నామీఁదఁ గినిసి యా
సామి రాఁడయ్యెనో !

౧౫

అతఁడు లేనిదె యొక్క
యడుగు వేయఁగలేనె ।
యతని వేణువుపాట
యమృతత్వపుం బాట ।

౧౬

ఆగమంబు లతండె
ఆ దేశికుం డతఁడె
యతని యందెల రవళి
యాత్మబోధముఁ జేయు.

౧౭

అతని బిగి కౌఁగిలిని
వజ్ఞానము నశించి
యవధులెల్లఁ దొలంగి
యాత్మనాదము తెలియు.

౧౮

ఆ నాదమె యనంత
మవ్యయంబై యుండు
నద్ది పిల్లనగ్రోవి
యం దనుభవించెదను.

౧౯

ఆ చిఱునవ్వు లో తెఱిఁగి, యా మురళీప్రకటీకృ తాత్మ వి
ద్యా చణగాన మానుట నతంద్రిత మామక చిత్తవృత్తి నీ
పై చెలఁగున్ గురూ! కనుల కంతయు నీవయి తోఁచ నీకు ని
న్నాచుకొనంగఁ జోఁ టొకటి ధాత్రి నిగూఢముగాఁగ నున్నదే?

౨౦

నా కీ దేహము భారమయ్యె నిఁకఁ గృష్ణా! కాలుసేతుల్ వడెన్
వాకోఁజాలను, నాదు నంగకము లస్వాధీన మయ్యెం బ్రభూ!
నాకుం దండ్రివి భర్తవున్ సుతుఁడవున్ సర్వమ్ము నీవే, "వినా
త్వా కారుణ్యసముద్ర మన్య మహ మాధారం న మన్యే గురో!"

# విడరాని ముడి

౧

వలపు లుప్పొంగి తెప్పల కట్టఁద్రోసి చూ
పులతోడ సాగు కన్నుల బెడంగు
పులు గడిగిన ముత్తెముల తళతళల ము
ద్దుల కోట్లు గోరు చెక్కుల మెఱుంగు
వలిపంబులోన నిక్కులు చూపి పురికొల్పు
వలరాజు కేళిబంతుల పసందు
కులుకు పెంజడ భంగిమల వేదులయి మరుల్
గొలుపు నితంబసీమల తెఱంగు

పొలు పెసంగు వాతెఱల తేనెలు; గమగమ
వలచు పద్మగంధముల పొంగులు; నడల హొ
యలులు: దోర్మూలరుచులు - నింతులకు నేల
నిలిపితివొ రమానాథ భోక్తలకుఁ గాక

౨

వితతసుగంధముల్ పరిఢవిల్లు సుమంబు సృజించి ధాని కం
చిత శబలమ్ములన్ నిలిపి శీధువునున్ నవకంబుఁ గూర్చి మా
రుతగతిఁ గుల్కునట్టి చదురున్ వెలయించి ద్విరేఫమున్ సృజిం
చితివి, జపంబుచేయుఁగనొ! చేరి మరందము లాను కోసమో!

3

ఒక యొయ్యారము సిగ్గు దొంతర లవేవో! ఓరచూపుల్ పకా
పకలుం బుల్కలు సోయగంబు తెలి రెప్పల్, నర్మ గర్భోక్తులున్
ముకుళింతల్, వసివాళ్లు, పైటసవరింపుల్ దేనికో పెట్టి యా
సుకమొందన్రసికున్ఘటించియఘమంచుంగామముంబల్కుదే

౪

తన సర్వస్వము భర్తృ దివ్యపద పద్మద్వంద్వ సంస్తవ్య సే
వన భాజంబుగఁ బుట్టినింటిని దరింపంజేసి లా మెట్టినిం
టిని స్వర్గంబుగఁ దీర్చిదిద్దెడు చిరంటిం బ్రేమపాత్రన్ ఫలిం
చినవృక్షంబును గూలఁద్రోసి యెటులన్ సేవింతు మోక్షార్థముల్

౫

మిలమిలలాడు పైఁడి పసిమిన్ హసియించెడు దేహకాంతి, గీ
టుల వసవల్చు చెక్కులు కడుంగడు హాయిని గూర్చు పాలబు
గ్గలు నిలువెల్ల ముద్దుల యగారము-చెంపకుఁ జేరెడేసి క
న్నులు నిరవొందు బాలకు ననుంగుకుమార్తుఁ ద్యజింపుమందువో

౬

తన మృదువౌయెదందఁదలిదండ్రుల యాకృతి యెంతగాను హ
త్తినదొ! పగళ్ల బూచియన దిగ్భ్రమ చెందెడి పిచ్చితండ్రి, రా
త్రిని దన చేయి కాలు గుఱితింపఁగఁ బైనిడి రక్షకత్వ ము
ద్రను గొని నిద్రవోయెడి నతంద్రత; వానిఁ ద్యజించు టెట్టులో

౭

తన కాహ్లాదకరుండు బాల్యమున, విద్యాబుద్ధులన్ నేర్చి కీ
ర్తిని దేఁజాలిన బుద్ధిమంతుఁడు ధరిత్రిన్ యౌవనంబందు, నం
తను బోషింపఁగ వృద్ధదంపతుల కాధారంబ, యా యట్టిఁ డౌ
తనయున్ సంసృతిబంధహేతువని చిత్తం బెంచదయ్యా ప్రభూ!

౮

పెండిలి పేరఁటమ్ములు దవీయముగాఁ దన దేహపాటవం
బుండిననాళ్లు దాచుకొనకుండ శ్రమించి భుజించి, పండెనో
యెండెనొ కాని సత్వ జవ హీనశరీరముతోడ 'నా' యనం
కొం డొక దిక్కు లేక ముది గోచరిలెన్ విడుమందువా ప్రభూ!

౯

మాకై పూర్వయతుల్ వచించిన లసన్మార్గాలలో నున్న 'కా
తే కాంతా' యను బోధమున్ వినఁగ, క స్తే పుత్ర అన్ పంక్తులన్
సాకల్యంబుగఁ జర్చచేయుఁగను స్వచ్ఛప్రేమ భగ్నంబుగాఁ
గైకోఁ జిత్తమురాదు మోక్షమును నిష్కామక్రియాపద్ధతిన్

౧౦

మమకారంబునఁ వీడి, సౌఖ్యములఁ గొంప న్వీడఁగాఁ గొట్టి,చు
ట్టములం బక్కము లందఱన్ గరిమెకాడం గాల్చి పెట్టించి, లో
కము మిథ్యాత్మకమంచుఁద్రోసి,మఱి యేకాంతమ్ముగా నిల్చి మో
క్షముకై పోవఁగ నేమిగా నగుదునో స్వామీ! జగన్నాయకా!

౧౧

ఇంతకుఁ జెప్పవచ్చినది యేమన నే నెవరైనఁగాని యే
ప్రాంతము గాని నా దిహపరంబుల రెంటికిఁ జెడ్డవాఁడనై
కాంతను బిడ్డలం బ్రజలఁ గాలను దన్ని త్వదీయదృష్టిలో
నెంతలొ యున్న ప్రేమను విహీనముగాఁ దలపోయ నోప్రభూ!

౧౨

ఇది నీ ప్రకటితరాజ్యము
మదినెంచక మిథ్యయంచు మసలినఁ దనువున్
వదలిన జీవుఁడు చేరెడు
పద మెట్టిదొ 'చిక్కుముడియ'-వలగా దెఱుఁగన్.

౧౩

బ్రతికితి క్రిందుమీఁ దగుచుఁ బాయని ప్రేమను మాతృగర్భ ని
ర్గత దివసంబునుండి తుదఁ బ్రాణము పోయెడి దాక, ధాత్రిపై
పితలు సహోదరుల్ చెలులు స్వీయులు పెద్దలు తోడునీడగా
వెతల సహించి, సంఘము దవీయముగా నెటబోదొ జీవుఁడా!

౧౪

జీవుఁడ! యీ జగం బెటులొ చెల్లఁగ నొంటిగ నేగుచుంటి వే
త్రోవను బట్టియో వెలుతురుల్ గలవో, కయిదండ యున్నదో
బావురుమంచు నున్న తెరువా, కయికోవుగ దారిబత్తెముల్
నీవి పదార్థముల్ విడిచి నిల్వఁగ లే వెట కేగుచుంటివో !

౧౫

ఎండజొ మిత్రకోటి యెలుఁ గెత్తి యలందురఁ బల్కకే వెతల్
పొందఁగఁ జేసి కన్మొఱఁగి పోయెదు కాయము వీడి; నీవు క
న్గొందువొ, విందువో మనసుకున్ దరిదోచదు, క్షుత్తుమాట యే
మందువు, నీకు మాకు నడుమం గల యట్టిది యేమి గ్రంథియో

౧౬

చక్కని కట్టుపాట్లు కొనసాగెడు సంఘములోన నిల్చి, స
మ్యక్కుల కామినీ మధుర మార్దవమంజుల రాగ రంజిత
న్యక్కృతిభిన్న, దివ్య హృదయంబున సౌఖ్యరసాబ్ధి దేలి, బల్
స్రుక్కుల సైఁచుశక్తి ధరలోనఁ బరాత్పరుఁ డిచ్చి ప్రోచుతన్-

౧౭

ఇక్కడ మాకుఁ దాను సృజియించిన దివ్య నిసర్గమందు నే
మక్కువ మర్మముల్ మధు వమర్చెనొ, దాని గ్రహించి, వాని స
మ్యక్కళ కింత యంజలి సమంచితభక్తి ఘటించునట్లుగా
న క్కరుణామయుం డొసఁగు హార్దరస ప్రవణైక బుద్ధులన్

౧౮

ఎక్కడి చావొ యేమొ, యెట కేగెదమో, కనరాని దానికై
చిక్కి, తపించి, తక్కరుణ చిందిన యందము కాలఁదన్ని కై
పెక్కి చరించు మాకు నిడుమా! మధురామల సుప్రసన్నతా
యుక్కమనీయ తత్త్వము కుహూకుహు నాదములందు శ్రీహరీ!

# నా ప్రపత్తి

౧

ప్రాతస్స్నానము చేసి శ్రౌతవిధి నిర్వర్తింప సద్భక్తి నే
యాతంకంబును జెప్పఁబోవని మదీయంబైన చేతం బయా
రే తార్మ్రరయి యేమి తొందరని కార్తికేందువా రాన శ్ర
ద్ధా తాత్పర్యము చూపెగా చరమసంధ్యావేళకున్ సల్పఁగాన్

౨

సాయంకాలము నక్తసూచిగ సమాసన్నంబుగా నిద్రయే
సాయంబై శ్రమ సుంతలేని యుపవాసంబున్ ముగింపంగ నే
నాయత్తంబయి వేఁడినీరము లలభ్యం బౌటచే దీర్ఘికా
తోయానం దలమున్క వేసితిని సీతున్ సైఁచి క్షుద్బాధతో

3

కూరల వేఁపుడుల్ బలిసి కొట్టఁగఁ దోడన మాషచక్ర చూ
త్కారము లుల్లముం గుదుపఁగాఁ దినఁ బ్రాణములేచిరాఁగ, నే
మే! రయ మేగిరమ్ము గుడిమిట్టక టంచును నేను దైవతా
ర్చారతిఁ దెచ్చుకొన్న ఫలరాజము లిచ్చితి భార్య కాజ్ఞతో

నక్త మన్నది యుడుదర్శనంబు చేతఁ
గాని కాదని కొంత యుత్కంఠపడితిఁ
పొడిచె నాదునెత్తిని బాలు పోసినట్టు
లపుడు నక్షత్ర మొక్కఁడు భపథమందు

౫

జపముంజేయ యమప్రయత్నమున దీక్షం బూనితింగాని భో
జ్య పదార్థంబు పయిన్ మనంబుసని తీక్ష్ణమైన యాందోళనం
బెప్పుడో చేయఁగ నూరకొంటినఁటె సామీ! తింటి రెట్టింపుగా
నుపవాసంపు ఫలంబు నీయఁగదె శంభూ! యల్పసంతోషివై

28

# లేఖ

౧

మాపైఁ గ్రోధముపూని యిట్టుల మహమ్మద్గోరిఁ రావించి, ఢి
ల్లీ పీఠంబున నిల్పి యెంచితివొ పాలింపం గనూజిన్ మహా
భూపానన్యుఁడవై, తురుష్కపతి చంపుం బక్కలో బల్లెమై
నీ పాపంబు ఫలించె దుర్యశ మిదే నిండెన్ జగత్త్రంతయున్

౨

శూరాగ్రేసరులంచు క్షత్త్రియు లటంచున్ ధర్మయుద్ధంబునం
బేరుం గాంచిన వా రటంచు రణభూమిం గూలి యామీఁదటన్
వీరస్వర్గము కాంతు రంచును ధనుర్విద్యా ధురీణాత్ములం
చీ రాజన్యులు మించియున్ సహనభా వైకత్వముల్ పొందిరే

3

జితకాశిప్రథముండు విస్తృతకనూజి ప్రాభవోద్భాసి శ్రీ
యుత గోవిందుఁడు నీదు తాతయయి, వంశోద్ధారకుండై యశో
వ్రతతీ నిస్తులి తావలంబ మయి పోవన్ వాని యూర్పేరు లే
గతి యౌనో యన నీ తరంబుననె కక్కా! తేలిపోయెం గదా

౪

బయలై పోయెను గాఁపురం బిటు భవ త్స్వాపైక కర్మాన, నీ
పయిఁ గాల్వెట్టిన నింద కింత టయినన్ వానిన్ మృధం జీల్చి, దో
ర్జయముం గాంచుటొ వానిచేతఁ బడి వీరస్వర్గముం గాంచుటో
కయికో బాణము నాచబాట యది సంఘస్తుత్య కార్యం బధే

౫

చనె విధ్యుక్త వధూస్వయంవర మహాసంరంభ మానాఁడు నే
నును నాకోరిన దివ్యసుందరుని గన్గో కున్కి నుత్కంఠతో
డను దద్విగ్రహమందు దండ నిడితిన్ డబ్బాటుగా సామి వ
చ్చెను, నా పుణ్యఫలంబు చేరితిని గించిత్తిందు తప్పున్నదే ?

౬

అరియే యాతఁడు ఢిల్లిరాజ్యము నుజేయంజాలుటన్, దాని నె
వ్వరు కాదందురు? వైర మెంతునఁ బె, శశ్వన్మూర్తి అజ్మీరు రా
జ్య రమాశోభితుఁ డొంట నింట నిటు భోగ్యశ్రీలు చేకూరఁగా
మఱి యన్యున్ వరియింతునే జనక యుష్మద్వంశ సంజాతనై

౭

ఇవి రెండే తలపోసితిన్ జనక! నా యీ పృథ్విరాణ్ణామ భూ
ధవ పాణౌకృతి నీకు నచ్చిన ననంతప్రీతి జామాతృ వై
భవ నిస్తుల్యత నెంచి మించెదవు, ద్వేడ్భావంబు తోతెంచెనేన్
దివికేగన్ వెనుదీయ యుద్ధమునఁ గత్తింబట్టి మన్నాధుతో

౮

అది నాధర్మము నా మనోహరుని బాహాశక్తికిన్ నాదు శ
క్తి దలిర్పన్ సమరంబు చేయుటయ, పృథ్వీరాజచంద్రుండు,పో
రి దివింజేరిన నేనుఁబోయెదను గీర్తిం గాంచి, గెల్పొందె నే
ని దిశాచక్రము నేలుకొందుఁ బ్రణయోన్మేషంబు రూపించుచున్

౯

లివలేశశ్రమఁ బోరిలోఁ గెలిచి ఢిల్లీపట్టణంబున్ రమా
భవనం బౌ నటు తీర్చి దిద్దిన మహీపాలుం డయః స్తంభమున్
సువిశేషంబుగ సప్తవింశతి గుడుల్ సుస్నిగ్ధచిత్రాలతో
డ వెలారించె ననంగపాలుఁడు నిజేష్టస్ఫూర్తి దీపింపఁగా

౧౦

అటు లా తోమరవంశకంధి తత శీతాంశుండు, ఢిల్లీపురీ
ఘటనాపాత్రుఁడపుత్త్రకుండుసనభూకాంతుండుమన్నాధుఁడం
తట మాతామహ రాజ్యముం గొనెనుగాదా! నీవు కాంక్షించుచోఁ
గటా! యుద్ధంబున గెల్చి పొందుటయ నీకర్తవ్యమౌఁ గాదఁటే?

౧౧

అనిఁ జందేల్ పరమాలునామక మహోబాధీశు నోడించి, కీ
ర్తిని గైకొన్న సమిద్విహారి కదనోర్విన్ గోరిసైన్యమ్ము తు
త్తునియల్ గాఁగఁ దురుష్కరాజకరముం దున్నంబుగాఁ జేసి గె
ల్చిన దోర్వీర్యుఁడు పృథ్వీరాజు పరిపాలింపంగఁగాఁడే భువిన్?

౧౨

ఇది భేదంబని చెప్ప నోచుకొనలేదే! సామదానాల నీ
మదిలో నెంచితె తండ్రి! సామమున సన్మానించి మాటాడితే
యది యట్లుండఁగనిమ్ము నాఁ డయినఁ గన్యాదాన పూర్వంబుగా
నిదమిత్థ మ్మని చెప్పినం బనులు కావే! నేను సంధింపనే-

౧౩

ఇది భేదం బని యైనఁ జెప్పుటకు లేదే! యీ యుపాయాలతోఁ
బదవీలాభము చేకురన్వలయు నప్పా! భేదముంగూర్చి యె
య్యది సాధించుటొ, నాదు నాథునొ, తదీయశ్రీనొ, నీవిప్డు త
ప్పిదముం జేసితి నీకనూజి కెసరుం బెట్టించి తౌ దీనిచే-

౧౪

అలనాఁ డీసులతాను గోరి తన రాజ్యశ్రీ సురాష్ట్రమ్ము లో
పల సుస్థాపితముం బొనర్ప ననిహిల్వార్ రాజుపై నేగ ను
జ్జ్వల చారిత్రుఁ డతండు గోరిని మహాసంగ్రమమం దార్చి తు
రుష్కులు రేఁగం బడఁగొట్టి పంపఁడె తురుష్కుల్ పేరెముల్
దీయఁగన్

౧౫

అది గోరీకిఁ బరాజయంబనుట యప్పా! చాలనే చాల, ద
య్యది తత్సైన్య పరాజయం బనుట పూర్త్యర్థంబు కానేర, ద
య్యది యిస్లాము పరాజయం బనుట సవ్యార్థంబుగా వ్యక్తమై
నది యారాజవతంసు కార్యమున జాత్యంభోధి యుప్పొంగఁగా

౧౬

నిరుడు విశాలబుద్ధి నవనీపులు నీ రసపుత్త్రవీరులుం
గరము తదేకదీక్ష రణకార్యము తీర్చిరి; పాఱిపోయి రీ
తురకలు రాజమండల విధుంతుదమూర్తివి యింటి దొంగవై
వఱలితి రేపు నీ కిటుల వాటిలు నేని ఎవండు దిక్కగున్

౧౭

రసపుత్త్రాన్వయ జాత భూవర పవిత్ర స్త్రైణ మేనాఁడొ యీ
యసువుల్ నాథుల పేరిటన్ ముడుపు లట్లత్యంత సంతోష మా
నసలై యర్పణ చేసి యుండిరి యదే నాపాలి దైవంబుగా
నసముం గూర్చుత సాగుమాన మది దిక్కై నన్నురక్షించుతన్.

# త్యాగరాజస్వామీ!

౧

ఒక మహతీసునాదము రసోజ్జ్వలమై భువి కేగుదెంచెనో
యకలుష దేవవాహిని హొయల్ పచరించుచుఁ జెంగలించెనో
చకచకి తాప్సరో నటనసంపద చిప్పిలెనేమొ! లేనిచో
సకలకళల్ భవత్కృతుల సాగునె కమ్రత త్యాగరాజస్వామీ!

౨

నీ కమనీయ వాక్కున ధ్వనించిన భక్తిరసాన చిత్త మే
కాకృతి చెందు భవ్య పులకాళి జనించు, ముదశ్రు సంతతుల్
వాకలు వాకలై తళతళల్ హృదయంబున గోచరించు, వే
మూకత సంఘటిల్లుఁ, బరముం గను భాగ్యము కల్గు నోప్రభూ!

3

నీ పదబంధమందు మహనీయ పరాక్రమధాముఁ డైన సీ
తాపతి తాను గట్టువడి, తత్పరతన్ సడలించునట్టి ధీ
వ్యాపృతి కల్గువారికి నవారిగ దర్శన మిచ్చు సామి, సం
తాపము పాపునట్టి యమృతత్వము పల్కుల నెట్లు గూర్చితో

౪

నీ తేనెసోనలు నెగడుపల్కులలోన
రామతత్త్వపు రవరవలు కులుకు
నీ తాత్త్వికవిశాల నిర్మలవాక్కుల
మోక్షయోషిత ముసిముసి చెలంగు
నీ తాన రాగ సంగీతైక గమకాన
వాణి కింకిణుల సవ్వడులు వెలయు
నీ తంబుఱా మీటు నేర్పున గాంధర్వ
విద్యాకుమారి పింపిళ్ళుసల్పు

పూత యైన కర్ణాట సంగీతలక్ష్మి
కీ తెనుఁగునాట గుణగణజ్యేష్ఠుఁడ వయి
త్యాగతత్త్వము మోక్షవిద్యాగరిష్ఠ
గీతములఁ ద్యాగమూర్తి ! పల్కితివి సుమ్ము !

౫

జ్ఞానపు టార్ద్రతాదశ ప్రశస్తతమం బగు భక్తి, దానికిన్
వీణయె సాధనంబు, తనివిం గని త్యాగము సల్పువాఁడు, ప్ర
జ్ఞానఘనంబు మోదకరి శాశ్వతమోక్షపదంబుఁ బొందఁగా
గానమె రాచబాట యనఁగాఁ దగుసాక్షివి నీవె త్యాగయా ।

# ఆహుతి

౧

ఆంధ్ర రాష్ట్రసాధన మహోద్యమ పరంప
రా లస న్నేతృరత్న చిరత్న వాంఛ
లుప్తమయి, లుప్తమయి మహాహుతిని మోసు
లెత్తె 'శ్రీరామ' రక్ష కా కేమియగును ?

౨

ధర్మయుత రాష్ట్రపాల నోత్సాహ మతులు
యావదాంధ్రుల కోర్కెలు వ్యర్థమై, ని
తాంత దీర్ఘసూత్రత గల్గ దానిఁ ద్రెంపి
'పొట్టి' చేయంగలాఁడు ప్రబుద్ధ బుద్ధి !

3

క్రాలినది యొకచుక్క
కాలదేవీ కైశ్య
మాలికా పరిళ
శ్రీ లసత్సుమ మోచు

౪

రాలినది యొకచుక్క
నీలాభ్ర పథములో
రాలె ముక్కోటి యాం
ధ్రాళి కన్నీళ్ళొకటు

5

35

# ఆచార్యస్వామి

౧

గంగావాః పరిపోషితాంఘ్రి తరుశాఖా శీతలచ్ఛాయలన్
రంగుల్ దిద్దు నుషస్సువేళ ముదమారన్ నిద్రమేల్కాంచి, భ
క్తిం గంగాంబు కృతావగాహుఁడయి సంగీతంబు కావింతు వే
ద్కం గుంజత్ప్రణవైకనాదము నిసర్గశ్రీల లీనంబుగా

౨

ఆ స్వేచ్ఛాత్మక గానసమ్మిళిత దివ్యానంద వారాశివీ
చీ స్వాభావిక భావపుంజములు వీచెన్ వాయులీనంబులై
ఓస్వామీ! యది యేమిశ్లోకఝరి? వేదోక్తిప్రసూనాసవం
బాస్వాదింపఁగనిమ్ము స్వానుభవ గీతార్థమ్ము సర్వస్వమున్

౩

అమ్మహితాంతరంగ గతమైన సుధామయ వాక్తతిన్ శివోఽ
హమ్మను నాద మొండు బహిరాగతమై ప్రవహించి పాయగాఁ
గమ్మని జాలుగా మడుఁగుగా నదిగా వడిగా స్రవించి సం
ద్రమ్ముగ గోచరించు వసుధన్ మఱి బిందువిమర్శ మెట్టిదో

౪

భిక్షాం దేహి యటందొ మైమరతొ యుర్విం గండమూలంబులన్
భక్తింతో ఫలమైన తిందువొ మహాభాగా అనూహ్యంబు, నీ
కుక్షి న్నింపుట భోగభాగ్యములు చేకూరంగనా ? జన్మకా
ల క్షేపం బదిగాక యందులకె వేళం బుత్తు శిష్యాళితో

౫

కాషాయంబును గట్టి శిష్యతతి ప్రక్కంజేరఁ గూర్చుండి, ప్ర
త్యూషంబుం బరమాత్మరూపమును వేదోక్తప్రకారంబు త
ద్భాషన్ బోధలఁజేసి యంతటను గీతాభాష్యముం జెప్పు నీ
వేషంబుంగని యెంతగా మురిసిరో వేమార్లు నీ శిష్యులున్

౬

ఈ వేమో మఱి ధ్యానమేమొ ! యితరం బేమైన వీక్షింప వే
భావంబందు లయింతొ కాని చిఱునవ్వే యుద్దిపొల్చున్ మహా
దేవత్వంబునఁ గొంతకాలము సమాధిం బుచ్చి నీలోన నీ
వే వేఱై త్యజియింతు దేహమును సామీ ! యాత్మసంధానతన్

౭

వందే జగద్గురు మతీత మహాయితీంద్రం
శ్రీ శంకరం పరమత ప్రతిపాద కోద్య
త్సిద్ధాంత తూలనిచయ స్వ వచోఽగ్నికీలం
స్వాత్మావబోధన లసత్పథ దర్శకం తం

౮

ఆచార్యదేవ మనిశం మహిత ప్రభావం
ధ్యాయామి భవ్య మనసా వచసా చ భక్త్యా
కాయేన పాపశమనాయ పరాత్మరూపం
పీయూష కంధి లహరీమయ వాక్ప్రపంచం

౯

శ్రీమ చ్ఛంకర భగవత్పాద ముఖోద్గత పవిత్ర వాగ్ధారాః
యావత్ప్రపంచ మానవ హృత్క్షేత్రాణి చ పునంతు మోక్షాయ.

౧౦

ఓ కాషాయపిశంగిమ స్ఫురిత భానూ ! నీదు భాష్యాంశుశో
భా కళ్యాణకలాపమే సతతజీవంబై ప్రపంచాన సు
శ్లోకంబై తనరారు నీ మధురమౌ సూక్తుల్ భువిన్ జోలలై
చేకూర్చున్ శిశు వూయలందున వలెం జిత్తస్థిరామోదమున్

౧౧

నీ మహనీయ తాత్త్విక పునీత హృదంత మహా స్వయంప్రకా
శామృత వాగ్రుచిప్రతతి యద్ది తమస్సును బాఱఁద్రోలఁగా
సామి ! త్వదీయశిష్యతతి జ్ఞానులుకారొకొ విన్కిచేతనే
యేమి కొఱంత యుద్భవిల వేయిలఁ దోటకవృత్తకోటులున్

౧౨

భాష్యములా ? వివేక తతవార్ధి లస ల్లహరీచయంబ ? అ
ద్వేష్యము లైన స్తోత్రముల? తీయcగc బల్కితి వాత్మబోద్ధృతా
కృష్యవతారమూర్తి ఉరరీకృత వేదపథైక వర్తి ! స
చ్ఛిష్య దిగంతకీర్తి యివె చేకొనుమయ్య నమశ్శతంబులన్

౧3

దోః కమలంబు విప్పి క్షమతో వివరింతు హృదబ్జ సుస్థితాం
భఃకణ దోషశూన్యగతి, బంధురభావము తోడ, నిర్మలాం
తఃకరణ ప్రవృత్తులకుc దాళముగాc గరసంజ్ఞ చేయు చం
హఃకరి సింహపోత సదృశాత్మక ! శంకర ! శంకరుండవై !

౧౪

నీవు కాలిడు తలములోని రజ మద్ది
యెంత పుణ్యంబుపండి సేవించినదియొ !
నీ పవిత్ర సరస్వతి నెగడినంత
యెంత పులకించెనో గ్రహియించి ప్రకృతి.

౧౫

# స్వాతంత్ర్య దినోత్సవము

ఒకనాఁ డెట్టి దురంతకృత్యముల నన్యుల్ మించి కావింప,మా
నక డెందాలెదురొడ్డి గుప్పిటను బ్రాణాల్ వట్టి పోరాడిరో
సకలం బుం ద్యజియించి సోదరులు ! త త్స్వాత్యాగ్రహాభీష్ట దా
యక రూపంబ ! త్రివర్ణ భారతపతాకా ! నీకు జోహారువుల్

౨

నలువదికోట్ల భారతజనం బరరే పెఱవారి పెత్తనం
బులఁ బడి చిక్కి మత్తుగొని మూసెను గన్నుల నాఁటినుండి నీ
వెలుఁగులు బాహ్యనిద్ర పరువెత్తఁగఁగొట్టి స్వతంత్రతాప్తి ని
స్తుల విభవంబు లీనెడిని సూత్రిత జాతిపతాక! నేఁటికిన్.

3

ఒకఁడా యిద్దఱ చచ్చి పుట్టి పరదాస్యో న్మోచనార్థంబు, వా
రక కాలంబు గృహాయమానముగఁ గారంబుచ్చి పోరాడి, ఘా
తుక కృత్యంబుల నెల్లెడం బరమ సంతోషంబునన్ సైఁచి, నేఁ
టికి నీజాతికి సుస్వతంత్రతఁ బ్రతిష్ఠింపంగఁ బుణ్యాత్ముకుల్

౪

అమితానందముఁ గూర్చు జాతిముఖ తిర్యక్పుండ్రమై, ఏకతా
విమలజ్ఞానము శాంత్యహింసల నిరూపింపంగ శక్తిత్రయ
స్వమతంబై, పరివేషసంకలితమై బాలార్కు రూపించి క
ష్టములం బాపి సుఖంబుఁగూర్చెడిని జెండా! రండు పూజింపఁగా

౫

ఎన్నియేఁడులో పరదాస్యశృంఖలఁ బడి
నేఁడు గట్టుచేరితిమబ్బ! మూఁడువంద
లేఁడులకు, నిది మనతాత లెఱుఁగనట్టి
సుప్రభావ స్వతంత్ర తాత్త్ర ప్రతిష్ఠ.

౬

పర సేన భారతావనిమీఁద నెటనో కాలిడెనన్న నాయింటవిడిసినట్లు
భారతీయుని ఔఱవారు పోనాడిన నా మనంబున ముల్లు నాటినట్లు
సారసారణుల దేశక్షేమమునకు నేర్పఱచిన నాచేను పండినట్లు
నిస్తంద్ర పాలనోన్మేషంబు రేకెత్తనాయింట వెన్నెలల్ ననిచినట్లు

ముందిపడి బాధపడి పొంగి మరతునొథలు
నేఁటి స్వాతంత్ర్యవాయువుల్ నెగడఁబీల్చి
వాఁటి పరపాలనమున లేనట్టి యొక మ
హానుభవము హృత్సీమను హత్తుకొనఁగ

౭

ఉభయసంధ్యల నింతహొయలు కల్గఁగ నేమ
హాత్యాగి పూతరక్తాంచి తమ్ము-
ఈ నిండుతన మద్ది యే దేశభక్తు యా
వజ్జీవశిక్షలోఁ బ్రకృతి నేర్చె
త్యాగమూర్తుల హృది తన్మయత్వంబౌను
దీయనిదైనజాతీయగీతి
నీదివ్యకాలం బదేమహాత్ముని శాంత్య
హింసాదులను జాటునెల్లయెడల

దేశవీరాళిహృదయ ముద్రితము లైన
ధర్మసూత్రాలు తనయందుఁ దాల్చినట్టి
ప్రకృతిదేవత యెదుట నారాధ్యులైన
ధన్యమూర్తులఁ దెలతు స్వాతంత్ర్యవేళ.

౮

తన శాంత్యహింసా ప్రథా విధానమ్ము భా
రతభూమికయి స్వతంత్రతను దెచ్చి
తన నిర్మలాధ్యాత్మిక నయ మనీష రా
జ్యాంగాలతోడ వియ్యంబు నంది

తన చేఁత త్రికరణాత్మక పథాంతమున జా
డలఁ దప్పకుండనందులకె నడచి
తన సత్యపథ మైక్యమునుగూర్చు సాధనం
బై భారతికి గురుఖ్యాతి నెఱపి

అఖిలలోకమ్ము తన్ను మహాత్ముఁ డనఁగఁ
బరఁగినట్టి మానవశుభంకర యశస్వి
విశ్వకల్యాణ వాంఛా పవిత్రమూర్తి
గాంధి కొనరింతు మివె నమస్కారవితతి.

౯

భారతీయ హృదయాకాశము
స్వాతంత్ర్యద్యుతి పరిపూర్ణము-
పుష్పవంతులై తారకలై
పొలుపారెను త్యాగమూర్తితతి.

౧౦

నిరక్షరాస్యత అస్పృశ్యత
నిర్మూలంబై పోవలయును
నైతిక వర్తన సౌదర్యము
నర నరమ్మునకుఁ బట్టఁగవలె.

౧౧

ఇవి జీవనదుల్ క్షేత్రములవి
ఇవి ఖనిజంబులు యంత్రములవి
అవిరళమగు కృషి జరుగవలెన్
వివిధ వస్తుతతి వెలయవలెన్.

౧౨

సకల సంపత్ప్రద ప్రణాళికలు సాగ
దేశ రక్షణకృషి సముత్తేజపడప
సుఖద కళలెల్ల దైవాభిముఖము గాఁగ
భారతం బొక స్వర్గమై వరలుగాత.

# పరిత్యాగము

౧

ఆరె భృంగీ! క్షతయోని! కాంపురము వమ్మై పోవ వేఱొక్కఁడౌ
వరునిం బొంది తిలోదకం బిడితివా, త్వద్భర్తకుం బూర్వ మీ
స్మరమిత్రోత్సవ కార్యనిర్వహణ గర్వ ల్లాపశోభా వశం
కర రోలంబ విలగ్నచిత్త వయి నీ కాయమ్ము నర్పించితౌ

౨

బలె అవ్వానికి నీదు యౌవన మహాభాగ్యంబు వెచ్చించి, యా
నలినీశ్రీ మధుతీర్థమందుఁ దలమున్కల్ వేసి, దాంపత్య స
త్ఫలితం బీక్రియఁ గొన్నటుల్ కొదమలై ప్రాపింప నేరీతి వీ
డ్కొలుపన్ బుద్ధిజనించెనో కదవె నీకుం బండుటిల్లాలికిన్

3

నీవేయిట్లు తెగించి యన్యుఁడగువానిం గూడుచో వానికే
నా వేఱొక్కతె లేనిలోటు ఘనవర్ణ స్నిగ్ధశారీరి, నీ
త్రోవే నీదయి వానిత్రోవ యటులై రూపింప నేవాఁడు ది
క్కౌ వార్ధక్యము నందు నిర్భరకు దీవ్య ద్యౌవనం బేగఁగన్

౪

ఇఁక నళినీ రజః పటల హేమరసాఢ్య గరుద్వపుర్మహో
త్సుకమతి యాతఁ డేగఁగ మధువ్రతు నొక్కని గోరి నీవునున్
సకలము వీడి పోవ నిటు చంచలచిత్తతఁ దేఁటిపిల్ల తె
ట్టికి బ్రతుకంగ వీలగునటే టకటొంకులు నీకుఁ జెల్లునే ?

౫

కొదమతేంట్లు తల్లిఁగని వాకొని పొగులవె
పర మధుకర సంశ్లేష సేవాప్రసక్తఁ
గొదమతేంట్లు తండ్రిఁగని వాకొని పొగులవె
పర మదాళినీ చుంబన పారవశ్య

౬

తమమాతాపితలం బరస్పర విరుద్ధస్వాంతులన్ వీడి యీ
కొమరుం దేఁటులు కాయముల్ నిలుపునొక్కో యన్యవాటీభవ
ద్విముఖత్వంబును, వట్టి చూపులును నిర్వేదమ్ము నమ్మించ ధై
ర్యము లో బీఁటలువాఱ కాల మెటు లోర్వంజాలు నోపట్టుది !

౭

కడుఁగాంక్షింతురు ముద్దరాలిఁగవయంగాఁగాముకుల్ యౌవనం
బుడుగన్ స్నేహము వీడిపోవు, సుఖమేమో కొంతకాలంబు చె
ల్లుడు యోజింపుము దీప మున్నపుడె చెల్లుం జక్కఁబెట్టంగ నిల్
నడుమంత్రం బగు కల్మియౌవనము, సంతానమ్ము నిన్నేమెడున్

౮

తన పాణిగ్రహణ స్వీకృతి యగ్నిసాక్షిగ సమాప్తంబై మహా వేదవి
జ్జనతాశీర్వచనప్రభావ సుషమాసంధాయియై యున్నినా
ళ్లు నిరాతంక సుఖావహంబుగఁ బవళ్ళున్ రాత్రులున్ సాగ వే
ర్మనుజున్ నేఁడు వరించుటల్ గనఁగఁగా మెంతతుచ్ఛంబహో

౯

మనసారం దపియించి తా వలచి సంపాదించుకొన్నట్టి భ
ర్తను గొఁగింటిడి, మాన్మథప్రణయసామ్రాజ్యంబు పాలించి, మా
టను మానంబును ధారపోసి కడకేటం ద్రోయుఁ దద్దివ్య మో
హనుఁ జేసేతల విస్మరించి చెలి, మోహమ్మెంత నైచ్యం బహో

౧౦

తనతోపాటు శ్రమించి వంటకము చేతన్ నాథు రంజించి, యా
తని సౌఖ్యమ్మును దుఃఖముం దనవిగాఁ దత్పాదపద్మమ్ము చెం
తను సంవాహనముం బొనర్చి, సుఖనిద్రా భద్రుఁ గావించు యో
షను నైజంబుననుండి నెట్టెడిని స్వేచ్ఛావృత్తి గర్హ్యంబకా

౧౧

అది హిందూమత ధర్మసంతతికి దోషాపాది, పాశ్చాత్య స
మ్మదసంపాది విడాకు, లీశ్వరతసామ్రాజ్యమ్ము పేర్మోగె శ
ర్మదమైనట్టి పతివ్రతాత్వమున దుర్మార్గమ్ము గోరంత త
ప్పదు కొండంతలుగాక పూర్వపు గురుత్వం బేల పోఁగొట్టుటల్

౧౨

కుటికావాసము స్వర్గతుల్యమయి చీకుంజింతయున్ లేక క
ట్టుటకుం దింటకుఁ గల్గిబొట్టెలును దోడ్తో మోదముం గూర్పసం
కట మన్నట్టిది లేని జీవనము వేడ్కన్ నాథుప్రక్కం గడిం
చుట కంటెన్ వనితాలలామ కిఁక నెచ్చో నేమిసౌకర్యమో ?

౧౩

మణిమండిత సౌధసీమ రామా
జనతానందిత భోగ్యభాగ్యమూర్తి
ప్రణయం బొకొ ప్రేమ కాదయేనిన్
జనుఁ జెప్పన్ మఱి దేనిఁ బ్రేమయంచు

౧౪

అసమానకళా కుశాగ్రబుద్ధి
వ్యసన స్త్రీజన తత్త్వ మౌనె ప్రేమ ?
అసమాన తనూ విలాసశోభి
వ్యసన స్త్రీజన తత్త్వ మౌనె ప్రేమ ?

౧౫

ధనియై కృతియై సురూపియౌ వా
నిని మోహించుటె ప్రేమయౌనొ చూడ
మనుకాలము వానితోడ నుంటో
తన యిష్టమ్మగురీతిఁ బోవుచుంటొ ?

౧౬

తననాథుఁడు డీలుపడ్డతోనే
యనువౌ వానిని జేరిపోవుటేన ?
తన పడ్డదినంబు నేఁడు దిక్కై
తన సౌందర్యము కుంటుపోవకున్నె ?

౧౭

అబలా ! ఒకనాఁటి కాపురంబా ?
విబుధుల్ మెత్తురె యిట్టి వక్రబుద్ధి ?
నిబిడం బగు కామనిమ్నగన్ నీ
వుబలాటంపడి పాపకంధిఁ జొత్తు

౧౮

ఒకనీతికిఁ గట్టుపాటుకాకే
సుక మర్దించుట కింక నేది హద్దు?
ఒకవేళ ధవుండు త్రోవఁ దప్పన్
సకియల్ వానిని ద్రిప్ప టెంత పేరొ ?

౧౯

ఒకవేళను స్త్రీ క్తిఁ బ్రేమ శారీ
రకసౌఖ్యంబును గూర్చునట్టి దైనఁ
బ్రకటంబుగ దేహజన్య మంచున్
మెకముల్ వోయెడి త్రోవఁ బోవుటౌనె ?

౨౦

అది మానసికంబయైన నాథున్
ముదిమిన్ వీడెడు గుంటచిక్కులేల ?
అదయుండయినం గురూపియైనన్
మదిలేకున్నను మధ్య రోగియైన ?

౨౧

మగవారల ప్రేమ యన్న స్త్రీలో
సొగసే నూటికి నూరుపాళ్ళు నెంత్రు
జిగి పోయిననాఁడు దానిమాటే
వెగటై పోవును వారి దృష్టిలోన ?

౨౨

జనియించిన దాది పూన్కితోడన్
మనలం జూచుచునుండు మృత్యుదేవి
మును మున్నుగ హెచ్చరింపఁ బంపుం
దన వార్థక్య విధేయ సేవకాళి

౨3

ప్రభుతా పటుశాసనంబు స్త్రైణ
వ్యభిచారంబును గట్టివేయు పట్ల
నభయంబుగ నీ విడాకు లుండన్
వ్యభిచారం బది చిల్లిగాదు, తూటు.

౨౪.

భరతోర్విని స్త్రీల కట్టుపాటే
నిరతఖ్యాతిని నీతిఁ బంచిపెట్టె
పరమర్షుల దివ్యసీమ యిట్టె
వర నారీత్వము రిత్తమాట యౌట ?

౨౫

ఒక పద్ధతి దేశకాలపాత్రా
ధికముం బట్టియె మాఱునట్టి దైన
నకటా కనుబోవు కాటుకేలా
ఇఁక కర్తవ్యము వేఱలేదె చేయ ?

౨౬

మతికూడక యెన్నఁడైన జాయా
పతు లొండొండును వీడిపోక లేదె ?
సతికిం బతికిట్టి స్వేచ్ఛయే, శా
సితమైనన్ మఱి పట్టఁ బగ్గ మున్నె ?-

# జవహరు జ్యోతి

ఎవని యౌన్నత్యంబు నీక్షించి హిమగిరి కుంఠిత మ్మయి
రక్షకునిగఁ గోరె
ఎవని గాంభీర్యమ్ము నెఱిఁగి శాత్రవదుర్మదాబ్ధి చలించి తా
వణఁగె వేల
ఎవని వచోఽమృతమెంచి త్రివేణులు చేష్టలుడిగి జన్మసీమఁగొలిచె
ఎవని ప్రజ్ఞాబుద్ధులెదిరికిసమ్మోహనంబులై ప్రేమబంధముల వైచె

ప్రథితశేముషీవిభవ యావత్ప్రపంచ
నాయకాగ్రణి వినుత కనచ్చరిత్రు
భరతజననీ సుపుత్రు జహ్వారు స్మరింతు,
జ్యోతిరూపుని భారతశ్రీ తిలకుని

౨

తన విశిష్టప్రజ్ఞ యననుమితమ్ముగ నాబాలగోపాల మైన వాఁడు
తన రాజనీతి నూతనదీప్తి కల్గింపఁ బ్రాక్పశ్చిమములమార్గ
మగు వాఁడు
తన శాంతి పథము వెల్గును జూప లోకాలఁ దలలూపఁజేయు
తత్త్వంబువాఁడు
తన కుటుంబము భారతప్రజానీకమ్ముతో నవినాభావ మైనవాఁడు

తనకు సందేహవిషయమ్ము తగులుపట్ల
తనదు నంతఃకరణవృత్తి తగుప్రమాణ
మైనవాఁడు భారతవాణియైనవాఁడు,
ప్రథితవిశ్రాంతకీర్తి జహ్వారుఁ దలంతు-

3

స్నేహోద్బుద్ధము మానవత్వసుషమాశ్రీ దివ్య మత్యంత దు
ర్మోహోద్భూత భయాంధకార దళనంబున్, ధారణీమల్లకో
ట్యాహాపాది జనైక సేవితము శశ్వ ద్విశ్వ సౌఖ్యప్రద
వ్యూహానేక గుణైక భాసి జవహర్జ్యోతిన్ సమర్చించెదన్

౪

కారణజన్ముఁడై తనదుకార్యము భారతపారతంత్ర్యమున్
దూరముచేయఁగా నయి, యధోగతి పేదఱికంబు భేదముల్
పాఱఁగఁ ద్రోలఁగా నయి ప్రపంచమునందున శాంతిచాటనై
భారతదేశగౌరవము వర్థిలఁజేసిన నెహ్రూ నెంచెదన్-

# అసమర్థత

౧

నేను నాన్న వద్దకు పోదు, నీ వెవండ
వెవ్వఁడవు నీవు, నన్నుఁబోనీయ వేల ?
నీకు దండంబు, నన్నుఁబోనిమ్ము, చూడు-
నాన్నతోఁజెప్పి నీకు బందంబు తెత్తు

౨

ఎవఁడురా నీవు మిడిగ్రుడ్డు లింతచేసి
పండ్లు పటపట కొఱుకుచుఁ బైకివచ్చి
నన్ను బంధించి పోనీక నా శిరోధి
పిసుకఁ జూచెద వయ్యయ్యొ వేఁడుకొందు

3

అయ్యొ ఎవ్వఁడో ననుఁ గత్తి గట్టె చూపి
చంపుచున్నాఁడు సారాయి కంపుగొట్టు
రమ్ము రమ్మిటు నన్నెత్తికొమ్ము నాన్న
భయము భయమయ్య దయ్యంబు వచ్చెనయ్య-

* * *

౪

తానె చూచెను దండ్రి యెందఱినొ కొట్టఁ
దనకుఁ నాన్నయే తెల్పె, నుద్దండుఁడ నని
వీధిలో రాత్రి భిక్షుకు వెళ్ళనేక
కతని యొడియె శరణ్యంబ యగుటనెఱుఁగు-

౫

నాన్నమాటలఁ. దా నమ్మినట్టి మనసు
నాన్న ప్రక్కను దాఁ, బండినట్టి సొగసు
నాన్న దేవునే, తాఁ, గొట్టునట్టి బిరుసు
నాన్నకై నేఁడు తహతహ నడుపులోన

*  *  *

౬

నాన్న రాక్షయ్య భూతంబున నన్నుఁబట్టి
లాగుచున్నది దాని తలన్ బడితను
బ్రద్దలుగఁజేసి నన్నుఁ గాపాడవయ్య
నాన్న ! రావేమి ? ఎక్కడున్నావు నాన్న!"-

౭

తండ్రిబుజమునఁ బల్వురింత లిటు సాగె
ఔడ్డనికిఁ జూడఁ బదియేండ్లు; వేఁకి హెచ్చె-
నతఁడు తెఱచిన కన్ను మూకత వహించు-
నతఁడు మూసిన కను వంచకత ఘటించు-

౮

నాన్న కన్నీటిధార లణంచి పల్కె
చిట్టినాబొట్టె ! కన్నెత్తి యిట్టు చూడు
నేను నీనాన్ననయ్య, క న్విప్పుమయ్య
నేను నీయొద్ద నుండ ని న్నెవనకు నెవఁడు?"-

*  *  *

౯

తాను బిలిచిన దేశంబు తత్ క్షణంబె
కదలివచ్చును, ప్రాణాలు వదలు తనకుఁ;
కోటివైద్యులు సూదులు గ్రుచ్చువారు;
బాలు నేడ్పించు దొంగను బట్టువాఁడు
తనకుఁ గనరాఁడు కన్నీటివనధి తెప్ప-

*  *  *

౧౦

నన్నుఁ జూడుము నేనుండ నిన్నుఁగొట్ట
గుండెయూ చెర్వ భయమేల కొడుకుఁ గుఱ్ఱ!-
యనెడి తండ్రికి నుత్తరమయ్యె - 'నాన్న !'
యెచట నుంటి వెవ్వండొ న న్నిట వధించు-

౧౧

నవ్వ నా కుఱ్ఱఁ, డది మననవ్వ కాదు
పల్కెనాతఁ డయ్యది మనపల్కె కాదు
మొఱ్ఱలిడు వాతఁ డది మనమొఱ్ఱ కాదు
చూచుఁదనలోన అది మనచూపు కాదు.

౧౨

వైద్యులెల్లరు పోరాడి వదలినారు
మంత్రవేత్తలు సతపోరి మరలినారు
తల్లిదండ్రుల మ్రొక్కులు తరలిపోయె
నిట్టె యిహలోకయాత్ర చాలించె నతఁడు-

౧౩

మెదడు బ్రద్దలైపోయె సుమ్మీ యటంచుఁ
గర్మ పరిపక్వ మయ్యె నీగతి కటంచుఁ
జూడ దేవుఁడే చినచూపు చూచె ననుచు
నెవరి మార్గమ్మువా రెలయించుకొనిరి-

౧౪

పితృవనంబున మృతుఁడు జీవించి లేచె-
నేమి జరిగెనొ యతనికే యెఱుకలేదు-
మానవునిబుద్ధి చంద్రబింబంబుఁ దాకె
శివుని రచనలో 'ఓనమా ల'వితెలియవు-

౧౫

ప్రకృతి కావలసీమ వాలకము లేవొ!
కాలపురుషుని కనుకట్టు గారడి యెదొ!
మృత్యుదేవత మచ్చు ఱమ్మెర లవేవొ!
మరణవేదన లోని మర్మంబులేవొ?-

# జ గ ద్గు రూ

౧

భిక్షన్ సల్పఁగ లేనియట్టి బ్రతుకబ్బెన్ సామి ! గార్హస్థ్యపుం
దీక్షం గొంటిని జేయఁగావలయు నాతిథ్యంబు, మీ సత్కృపా
భిక్షన్ యాచనచేయ వచ్చితిని బాపిష్ఠుండు వీఁడంచు నన్
శిక్షింపన్ దొరకొందురో యెడఁదబొచ్చెం దెచ్చుకొంటం బ్రభూ!

౨

తిరిపమె మాకు దిక్కని యతిప్రవరుల్ బలుకంగఁ బోకుఁడీ
తరుగనియట్టిదౌ యమృతతత్త్వ మహాధన మున్నచో టటం
చెఱుఁగుదు, భక్తి యవ్ దృణమె యిచ్చితిఁ గానుకగ, నర్థి
యర్హతన్
శరణమువేళ నెంతొ ! కరుణాభరణా ! తరణమ్మె కోరితిన్

3

తలపం గామ మిదొక్కటే కల దెపండం దీర్పఁగాఁ గామకో
బుల మీ రీపద గెత్తినా, రిహపరాటోపంబులం దట్టుకోఁ
గలమా మీ రిడకున్న దుఃఖహర రక్షాభాజ నానందదో
హల సంతారణ భవ్యమార్గ విహితోద్య ద్దివ్య పాథేయమున్

౪

కపి మార్జాల విహంగ మీన కమఠ గ్రాహ్య ప్రమార్గంబులన్
విపులా సర్వజనాళితారణ కళా విస్ఫూర్తి రూపించున
ట్టి పరబ్రహ్మ సుమూర్తి ! శంకర ! కనిష్ఠీభూత సద్దేవతా
ధిప భాగ్యోత్కర ! కావవేడెద భవాబ్ధిం జిక్కినాఁడం బ్రభూ !

౫

మీచూపు వెచజల్లు మేలిమివెన్నెలల్
జల్లులై భక్తిబీజములు మొలచు
మీపల్కు మేల్కొల్పు మేలిమివాసనల్
కొల్లలై ధర్మంబు కుసుమిత మగు
మీప్రసాదము కూర్చు మేల్మిదోహదముల
జ్ఞానవృక్షము కాయ సాగి పండు
మీయుపదేశంబు మేల్కొల్పుశక్తులు
మృతికెల్ల భస్మసాత్కృతి ఘటించు

సచ్చిదానందమూర్తి మీశరణె దిక్కు;
నిర్మలానందఘన మీదు నెనరె వెలుఁగు
నిరతిశయ జగద్గురు! మీదుకరుణ రక్ష;
జ్ఞానసౌందర్యశోభి ! మీస్మరణ శిక్ష—

59

# మహాసంకల్పము

౧

ఎవఁ డీతండు మహాప్రశాంత సుషమా హేవాక సద్వీచికా
నివహ స్ఫూర్త్యనుమేయ యోగబల సుస్నిగ్ధుండు, సిద్ధుండు క
న్గవ పాంకంబున వాగ్విధానమున నాగప్రాన్వయుండౌ, తపః
ప్రవణ త్వాత్త యశోఽర్జునత్వ మది రూపంబైనయ ట్లుండెడిన్

౨

కాషాయాంబరధారియై పలుకు నుత్కృచ్ఛాత్రవర్గైక సం
తోషాంభోధి తరంగముల్ బలిసి మున్నుల్ముక్తి జైవాతృకా
శేష శ్రీఁ బురుడించు మోము సుగతా శీఃపూర్వ సద్బోధ పీ
యూషానల్ప సుధారలం గురియ సద్యోముక్తిసంధాత యై

3

క్రమరీతిన్ యతిసత్తముండు శరణం గచ్ఛామి బుద్ధ మ్మనన్
గమనీయంబుగ నాప్రభుండు శరణం గచ్ఛామి ధర్మ మ్మనన్
కమనీయంబుగ నాగురుండు శరణం గచ్ఛామి సంఘ మ్మనన్
శ్రమణుల్ పల్కు దురట్టులే త్రికరణ స్పష్టంబుగా బుక్కులన్

౪

ఆచార్యోత్తమ మీదుకారికల గుప్తార్థంబు వ్యక్తంబుగా
నీ చట్టుల్ మిము వేఁడువారనఁగ నేమీవృత్తియా యంచెదో
తోచంగా నకుతోభయో భవ సముద్యుక్తోఽస్మి యంచున్ స్మృత
ప్రాచుర్యాననుఁ డైన యా మహితుఁ డే ప్రాజ్ఞుండొ బౌద్ధాకృతిన్

౫

సత్యాన్వేషణ నిష్ఠితాత్మకుఁ డహింసామూర్తి రోగార్తులన్
మృత్యూదగ్ర ముఖంబునుండి సతముం బ్రేష్ఠమ్ముగాఁ బ్రోవఁగాఁ
బ్రత్యగ్రాత్ముఁడటే; ప్రతుస్సుజన సేవాశీలి; దివ్యౌషధి
ప్రత్యేక ప్రతిపన్న బుద్ధి యెదియో స్వాంతమ్మునం దెంచెడిన్.

౬

నేనేమో యిటు బోధలన్ సమయమున్ వెచ్చింప, నీదారి నీ
దై నిత్యంబును గంధికై యరుగుటేనా జీవనంబంత, య
య్యో నిస్స్వప్రజ కింత భిక్ష యిడలేవో త్యాగముంజూపి, త
ల్లీ! నీజన్మము ధన్యమౌ, సుగుణవల్లీ! భవ్య కృష్ణానదీ!

౭

నీ నాథుండు తదీయసంపద నహో నెమ్మిన్ సమర్పింపఁడో
దానం బేరునుగాంచఁడో, యతని కర్ధాంగిత్వముం గల్గి సే
వా నిస్తంద్రత సాగరత్వము భజింపం గూడదో, తల్లిరో
యీ నేలం బ్రవహించి మా కిహపథా లిచ్చోటనే కూర్పవే-

౮

శృంఖలలోఁ దగుల్కొనిన జీవుల రక్షణలో శరీరమా
ద్యం ఖలు ధర్మసాధన మటన్నది ముఖ్యము; నీకన త్పద
ప్రేంఖణ రీతి ప్రాణులకు భిక్షయిడున్; తదనంతరంబె, మా
శంఖము మ్రోఁగు, నీదయయె జాతికి జీవము కృష్ణవేణిరో!

౯

సేవాతత్పరు లెల్ల భిక్షుకులు, సౌశీల్యమ్ము సౌదర్యమున్
యావల్లోకమునందుఁ గూర్చెదరు, ధ్యేయ మ్మద్ది నిర్వాణమై-
యీ విద్యాలయభూమి విశ్వజనతా హేలా పదోద్భాసియై
వే వెల్గులఁ ప్రకటించుఁ బూతమగుఁ ద్వ ద్విన్య స్త పాదాలతో

౧౦

ఏను భగీరథుండ నగు టెట్లగు నీదగు గంగచేత నీ
మా నిలయమ్ము ప్లావితము, మాన్యము, పావన మౌటఁగాక, కృ
ష్ణానది! మా యనంతరము జాతికి జీవముపోయునట్టి నీ
వే, ననుఁగూర్చి యిచ్చుటనె వెల్గి సుభిక్షముచేయు సీమలన్

౧౧

వందిత దేవతానికర భవ్య కిరీట మణిప్రభా లస
త్సుందర దివ్యపాద! పరితున్న జనావన దక్ష! సచ్చిదా
నంద ఘనస్వరూప! కరుణా వరుణాలయ, వీతరాగ, క
ర్మంది శర త్సుధాకర, నిరంతరపావన! బుద్ధ! తేనమః-

౧౨

ఈ సంకల్ప మమోఘ మంచుఁ దనలో నెంతో భవిష్యంబు, లి
ప్సా సంసిద్ధముగాఁ దలంచి, కనురెప్పల్ విప్పి, సానందుఁడై
యాసీనుల్ శ్రమణుల్ తథాగతుని దివ్యస్తోత్రముల్ సేయఁగా,
నా సూక్తిన్ మఱి భావి యుజ్జ్వల మనెన్ నాగార్జునాచార్యుఁడున్

౧౩

తన కార్యదీక్ష సీతాభాగ్యమునకు నై
తత సేతువునకు 'నీలత' భజింప,
తన యుగ్గమునఁ దెచ్చుకొనిన సంకటి కలి
దేశ సేవావ్రత దీక్షఁ దెలుప,
తన దృఢభుజబలోద్ధతి, ఖనిత్రంబుతోఁ
జేరి రాచట్టు బెచ్చికలుగొట్ట,
తన దేహయష్టి పొందిన పాటునకు ఫలం
బులు ఫాల ఘర్మాంబువులు చెలంగఁ,

బాటుపడు శ్రామికునిసాటివారు, లక్ష
లై, శ్రమింపఁగా నాగార్జునాఖ్య సాగ
రంబు, రూపొంది, సార సారణుల మీఱు
టా మహాసిద్ధు సుస్థిరధీ మహస్సు

# ప్రేమ బిందువులు

౧

రానీ నాన్నను, జెప్పనా? యరరె! యుగ్రంథమ్మో! క్రొంగ్రొత్తదే
దాసం గీచితి పిచ్చిగీత, లయొ! నీ తాఁ టొల్చు రానిమ్మనన్
నేనక్కా! యిఁకఁజేయ నెప్పు డని, తంద్రిం గౌఁగిటన్ గ్రుచ్చుకే
తానై చూచు కవాటరంధ్ర చకితోద్య ద్దృష్టి, స్వర్గం బహో!

౨

అప్పాగఁ దండులంబు లిడునట్టి ప్రదేశము లింక మృగ్యమై
తిప్పల నొందలేక, వెలితిం గననీయక, లేవడిం గనుల్
గప్పి, నిజేశు కింత తినఁగానిడి, నవ్వులఁ దేల్చిపంపి, తి
న్నప్పటి రీతి నిద్దపుమనంబునఁ గొల్చు ముదశ్రు లెట్టివో!

3

అతఁడు నిమీలితాక్షుఁ డయి యార్ద్రతతో 'నమకంబు' చెప్పఁగా
నతివయు దైవమందిరము నచ్చపుబత్తిని బూల నింపఁగా,
నతఁడు నివాళు లెంతొ యిడ, నామె రసాన్నము సామి కీయఁగాఁ
జత యట సాఁగిలింబడ, లస త్పులకల్ విలసిల్లు పెంచెదన్.

౪

అతనికి నాల్గురోజులుగ నన్నములేదు, గృహంబు లెల్ల దీ
నత నొక ముద్దకై తిరిగినాఁడు, కనుంగవఁ బ్రాణముంచి, మా
తృత వెలివచ్చి, యింతి యొనరించిన పాసినముద్ద నుప్పుకల్
జతగ, జలంబునించి, మిపులం గొని పల్కెడుమాట, వేద మౌ

౫

త్రికరణశుద్ధిగా వసుమతిన్ సుఖశాంతులఁ గూర్పఁగా, సహిం
సకతయు, సత్యపాలనము సల్పు తపస్వి, ప్రశాంతమూర్తి ప్రే
మకు నిలయంబు, గాంధి, నయమార్గము చాటెడుచో
ఖలుండు, గుం
డెకు గుఱిచూచి కాల్చినను, డెందము రామునివీడి పల్కెనే !!

# నమో దారిద్ర్య దేవతాయై

౧

పూతచరిత్రులై యతిథిపూజలతో నిలు వెళ్ళఁబుచ్చు మా
తాతలు తండ్రులుం గడు ముదంపడి నిన్ను భజించినారు, నా
చేత నదే విధంబుగ నశేషసపర్యల నందుకొంచుఁ ద
ల్లీ! తరియింపఁజేయుము కలిం గలియిచ్చియొ! గంజి నిచ్చియో!

౨

మా వంశంబునవారు నీ చరణ పద్మద్వంద్వమున్ నిత్యమున్
సేవింపంగను నేర్చి నీ కరుణచేఁ జిన్మూర్తులైనారు, నా
భావంబందున నీవు నిల్చి, విషయవ్యామోహముం జీల్చి, నెం
తే వైరాగ్యముఁ గూర్చి యీ జననరాహిత్యంబు సంధింపుమా

3

భువి నెవ్వారును నిన్నుఁ గోరరు గృహంబుం జొచ్చినన్ నిన్ను తేఁ
కువతో ఢీకొని పాఱఁద్రోలుదురు, శక్తుల్ చాలకున్నన్ రమా
ధవుఁ బ్రార్థింతురు నీ వినాశనముకై తంత్రంబు లెన్నేనిఁ బా
టవ మొప్పన్ ఘటియింత్రు; తీసితిఁ గవాటం బేను నీ రాకకై.

౪

ఈ మహిలోన నెందఱొ యహీన కళావిభవంబు లెల్లఁ బ్ర
జ్ఞాపహితుల్ త్వదీయ పటుశక్తిని వమ్ముగఁ జేయఁగానొ, నిన్
గీముల నుండి త్రోల్లఁగనొ, నీవ్రతమున్ వెడలంగఁ గొట్టనో
త్రా మయి ధారపోయుదురు ద్వంద్వముమాటఁ దలంప రేలకో.

౫

మోక్షలక్ష్మికి, ధనలక్ష్మి, కీ క్షితిఁ గడు
మోదమును గూర్చు జ్యేష్ఠ సహోదరి వయి
నీదు కరుణనె వారిఁ బొందించునట్టి
ధీరమతి వని జగము గుర్తించుఁగాక !

౬

లోభిసంతతి భాగ్యవ ల్లోక మకట
నిన్ను భజియింప కున్నఁ జింతింప నేల ?
తే రటే నీకు సత్కవుల్ శ్లాఘనులు
యతి వరేణ్యులు భవ్యాశ్రయంబుఁ గూర్ప !

౭

ఒకని ధైర్యంబు, యోగవిద్యకుఁ గుశలత,
తత సహిష్ణుత, పరికింపఁ దగినయట్టి
పరము నికషోపలంబ మివ్వసుధ నీవె
మమ్ముఁ గరుణించి వెతఁ బాపవమ్మ తల్లి !

౮

కుటికావాసము, వేళ కింత గతుకున్, గూనల్ దరిన్, స్థండిల
స్ఫుట తల్పంబుఁ, జినుంగుఁజాప యొకతుంపుం, ద్రాగు
బొచ్చెల్ వినా
బటువౌ విందుపసందులున్ సొబఁగు పేర్పాటుల్ ఘటింపంగ,నా
కెటులౌ? స్నిగ్ధ మనంబుతోఁ గొలుతుఁ దల్లీ! పొల్లు లేకుండఁగన్

౯

చెలఁగు మాయింట నినుప గజ్జెల రవంబు
కెరలు మాయింట లాస్య భంగిమల యెఱపు
చోరకోటులు మముఁ జేర రారుగాక !
ఎట్టి భయములు దూరమై యేగుగాక !

౧౦

ఎంతొ భాగ్యమ్ము కల్గు దేవేంద్రుఁడైన
తాలు తబకైన లేని కుచేలుఁడైన
నిన్నుఁ గొలువక తప్పించుకొన్నవాఁడె?
నిన్ను సేవించి ధనిగఁ గాకున్నవాఁడె?

౧౧

నీవు నెగడిన నాళ్ల నెంతేని సుఖము
నీవు వెడలిన నాళ్ల నన్నియు దిగుళ్ళు
నిండుగా మున్గినట్టి వానికిఁ జలియొకొ
యందు రార్యులు నీ రాక యది హిత మగు

౧౨

చినుఁగుఁబాతల వస్త్రంబుచే భజింతుఁ
గోరి నైవేద్యముగ యవాగువు ఘటింతు
డంబముగఁ జిల్లపెంకుపీఠము రచింతు
కష్టమే లేని కైతలఁ గట్టి యిడుదు.

౧3

దాత పైని బఱపు లోఁతైన చిఱునవ్వు
మోక్షలక్ష్మి నికటమునకుఁ జేర్చు-
లోభి మీఁదఁ బఱపు లోఁతైన చిఱునవ్వు
నరకపంకమున నణంగఁ గొట్టు-

౧౪

ఒలికి యొయారముల్ కురియు నుప్పుడుచప్పుడు లేనినడ్కలం
బొలుపగు రాకపోకల చవుల్ హవణిల్లెడు పెద్దతల్లి ! బల్
చలువల చూపుచాలుల పిసాళములం గడు లిబ్బులిచ్చు లే
ముల జవరాల! పేర్మి మముఁ బ్రోవుము! నీదు వనుంగుఁబిల్లలన్

౧౫

మాసిన వేసముంగొని సమంచితభక్తి ఘటంచి నీవు వి
చ్చేసిన దాది నెంతయు కృశింతిమమ్మ ! త్వదీయ సేవలో
మోసము లేనియట్టి వ్రతముంగొని 'కాసినివేడినీళ్ళకున్
గాసినిచల్లనీళ్ళు' కలగల్పులుగా నొనరించి తల్లిరో !

౧౬

తెలియని చిన్నకుఱ్ఱఁడు మదిన్ బుడుతల్ తనతోడివారు దు
వ్వలువలు దాల్చిరం చలిగి వస్తు పరుండినవాఁడు వానికై
గిలగిల కొట్టుకొంచు, నది కేవలమూర్ఖత, ఈర్ష్యకాదు, లే
ముల జవరాల ! నీవు చలమున్ వహియింపకు మమ్మ వానిపై

౧౭

కల్గి నయ్యలు మమ్ముఁ జుల్కనగఁ జూతు
రమ్మ, విద్యాధనమ్ము శూన్యమ్ము వారి
కెన్ని వస్తులు చేసిన నేమి మేము
చెప్పుదుమె తల్లి ! నీ మది చిన్నపోదె ।

౧౮

పలు తెఱంగుల జడ పిఱుందుల నటింప
మడమలబెడంగు లొకవింతనడలఁ దేల్పఁ
జకచకచ్చక, ధనధనల్, సాగి, కనక
వర్షములు నీదుకరుణ నొప్పారు గాత !

# ఇదం బ్రాహ్మ్యమ్

౧

అద్ది నిజపరబంధ సమ్యగ్వినాశి
మంత్ర నిష్ఠిత జ్ఞాన సమాధిముద్ర-
అద్ది మోదఖేద మహార్ణవాపర తట
రూఢవైరాగ్య నిష్ఠి తోరు ప్రవృత్తి-

౨

తెల్లవారిన నురిశిక్ష; యెల్ల బంధు
గులు, సుహృత్తులు నాప్తకోటులు వలవల
రోదనము చేయుచుండిరి బాదుకొనుచు;
గుండెలు కరంగి పొంగి కన్గొనలఁబాఱె

3

ముఖములో నెట్టి వైవర్ణ్యము పొడలేదు
మాటలో నెట్టిదగు తొట్రుపాటు లేదు
కంటిలోనైన బెదరు 'మొక్కట్లు' లేవు
అతని దినచర్యఁ బొరపొచ్చె మనఁగ లేదు

౪

నాఁటి లెక్కల చూచుకొన్నాఁ డతండు
అంతరంగమ్మునకు నద్ద మైన ముఖము
మందహాస రోచిస్సులఁ జిందఁజేయఁ-
బలుకరించెడివారు విభ్రమము చెంద-

౫

సంపదల కేమి లోటు? రాజ్యంబు నేత-
రూప లావణ్య తారుణ్యాధిపట్టిఁ
డల్లువాఁడును గుడిభుజ మైన వాఁడు
ధీరశాంతుఁడు నందకుమారుఁ డతఁడు.

౬

"మేత్రకజై" వచ్చి తెపు మీ మరణదండ
మంచు డగ్గుత్తికను హెచ్చరించినాఁడు
"సర్వసిద్ధము - విధికి సుస్వాగతంబు
ప్రభునిఘటనలు జరిగి తీరవలెఁ గాక"

౭

అనుచు నిహలోకకార్య బంధనము ధనము
పలుతెఱంగులఁ బాఱు కాల్వలు రచించె
సన్నుయాలతోఁ దనబుద్ధిసరణిఁ బట్టు
కొనుచుఁ జిబుకంబుమధ్య నంగుష్ఠ ముంచి

౮

తాను దండనవిధి మహాస్థైర్యబుద్ధి
నిర్వహించెడి దిట్ట; సందియములేదు-
జనపతిముఖంబు బ్రహ్మతేజస్సు లొలుకు!
మేక్రబై నిల్వలేక గమించె నంత-...

౯

అరుల యిరులయు గుసగుసల్ విరిసిపోయె
తెల్లవారి ముఖంబులు తెల్లవాఱె
తెల్లవాఱినపిదప, నా దినకరుండె
నాఁటి కర్మకాండము చెప్పునట్టి సాక్షి.

౧౦

మేల్ముసుఁగు తీసి ధర్మభామిని తదేక
దృష్టి సారించి యాశీర్వదింప వెడలె
రాజచంద్రుఁడు, తా గజరాజుగతిని
చివరిచూపులతోఁ బ్రజల్ సెలవుగొనుచు
బావురంచును గుండెలుబాదుకొనఁగ

౧౧

వధ్యతలమును జేరెడు వానియందుఁ
దొట్రుపాటులు తడయుటల్ తొలఁగిచనుట
లొడలుతెలియకపోవుటల్, దడదడలును
సంభవింపవు మందహాసంబు తక్క

౧౨

చేరి కూర్చున్నవాని దృష్టిని మరల్చ
నచటిభటుఁడు ఘటీకార యంత్రమునకు
సర్వసిద్ధమటంచు నాసనము వీడి
తరలె నాతఁడు యోగముద్రకు యతియయి

౧౩

బ్రాహ్మణత్రయి తచ్ఛరీరము కొనంగ
నిలచియుండఁగఁ గౌఁగిలించెను బ్రభుండు-
అంతమూర్తులై గొల్లని యరచినారు
అతనిమోమున దైన్యచిహ్నములు సున్న

౧౪

మరణపాశమువనికి సమ్మతము తెల్ప
సైగచేయుఁ డనంగ 'తెన్నగ వచింతు'
ననియె, నాతఁడు, మేక్రబై యతనితోడ
గంటకాలము గడపె నక్కజము పడుచు-

౧౫

ధ్యానముద్రను దగ సమాధాన పఱచి
యంతరంగముఁ గట్టుకొయ్యకు బిగించి
యరమరలులేని బుద్ధితో నాత్మ నెంచి
కరణములు మూఁడు త దభిముఖమ్ము చేసి-

౧౬

మోక్షలక్ష్మి ప్రసన్నయై ముందునడువ
ధర్మదేవత తనకుఁ గైదండ నిడఁగ
దేవ దుందుభిధ్వానముల్ దివిని వెడల
లోకమెల్లను బాదముల్ గొనుచుఁ బడఁగ

౧౭

ధీరగంభీరమూర్తి యుద్దిష్టతలము
నండలమునెక్కి చేరె, దృశ్యంబుఁ గనుచుఁ
బూర్వరంగముసాగె నప్పుడు, తొణఁకఁడు
ఏల యాలస్య మను, జపమాలఁ ద్రిప్పె.

౧౮

"ఉరికి సిద్ధంపుసైగగా 'సరతు' ననఁగ
సాహసించితి, రిచట కోలాహలంబొ ?"
యనఁగ నటులైనఁ 'జేసంజ్ఞ' యనె "నవియును
గట్టఁబడు" ననఁ 'గాలిని గడలుతు' ననె

౧౯

అది యపూర్వమై, మేక్రబై - యండలమ్ము
నిలుపుఁ దురికంబమునకు దాపులననంగ
సతఁడు నడచెద ననుచు వాహ్యాళి వెడలు
రీతిగాఁ జేరి, బంధింపఁ జేతుల నిడె.

౨౦

నిలువుచేతుల వెనుక బంధించినారు
చేతిగుడ్డను; రాజు వాంఛితమునెంచి
సాఁగిలి ఘటించియున్న సజ్జనుని బిలిచి
వాని ముఖబంధనముచేయ వస్త్ర మిడిరి.

౨౧

అతఁ డెంతటి గొప్ప పుణ్యాత్ముఁడొ మఱి
యతని యనుబంధ మెట్టిదో ! యవిటికాళ్ళ
వేదికను బ్రాఁకి తమ్మఖాచ్ఛాదనమ్ము
చేసె రాజుతేజము ధన్యుఁజేయ వాని-

౨౨

ధీరుఁ జిన్మూర్తి నందకుమారుఁ గనిరి
వీరు, బ్రహ్మర్షి నందకుమారుఁ గనిరి
సత్యరూపుని నానందసారభూతు
సంగరహితుని శాశ్వతున్ జనులు కనిరి-

౨3

భయము, దేహాభిమానమ్ము వానిలోని
యణువులందునఁ గూడ శూన్యంబు, నిలిచి
యోగముద్రను వైచి సాయుజ్య మొందెఁ
గట్టెమాత్రము పాంచాలికగ రహించె-

౨౪

ధర్మదేవతాకంఠ రుద్రాక్షమాల.
ముక్తికామినీ మందిరంబునకు మెట్లు,
శ్రీ పరబ్రహ్మలోక నిశ్శ్రేణి, మరణ
పాశమందున వ్రేలాడె వాని బొంది
యద్దియు వికారరహితమై నలరె నంత
ముక్తిదేవత సుతు నంకమున గ్రహించె.

౨౫

తెల్లదొర యాజ్ఞపై నురిదీసినారు
శిక్షితుని దేహకళ మార్పు చెందదయ్యె
ధీరగంభీరముఖము, బంధిత కరాలు
చిత్రమందున వలె సమీక్షించినారు.

౨౬

ఆంగ్లపాలన మందు నన్యాయ మింత
తాండవించిన కాలాన దారితప్పి
న్యాయమూర్తులు పూరితిన్నారు దొరలు-
కలుష రహితు లెక్కిరి యురికంబములకు-

౨౭

కుంపిణీవారి పాలన కూలఁద్రోయ,
రాజు, బల్వంతసింగున్ మరల్చె, మేటి
షూజవుల్‌దౌలతో మైత్రిచూపి కలిసె,
పాండుచేరి రాష్ట్రప్రతినిధి ప్రక్కఁజేరె-

౨౮

అనెడి దోషముల్ కొన్ని కల్పనము చేసి
దొంగ చేవ్రాల నేరంబుతోఁ జెఱ నిడి
లంచముల బకాసురునిమూలమున నురికి
శిక్షఁగూర్చుట ఇదియొండె సృష్టినుండి-

౨౯

కుంపిణీవారి ధనము కోకొల్లలు తిను
లంచములరాయు పనిని బట్టించు నట్టి
వ్యూహమునఁ జిక్కు హేస్టింగ్సుబుద్ధి ధర్మ
పీఠమును వధ్యశిలగఁ గావించె నయయొ !!

౩౦

ధర్మ మెఱిఁగిన యాంగ్లమేధావు లెల్ల
మివుల గర్హించి జాతిగౌరవము చాటి
రాఋనట్టిదె నందకుమార హనన
పాపపంకము వాని కెప్పటికి నైన

# ఋతు సంధులు

వసంత గ్రీష్మము-

౧

కమ్మని పిల్లతెమ్మెరల కాళ్ళకుఁ దాపపుబంద మంటి, శై
త్యమ్ము నశింపఁ, బుప్పొడులతావులఁ గ్రోలెడు ఘ్రాణమందు ఘ
ర్మమ్ము మదంపువాసనలు గ్రమ్మియుఁ గ్రమ్మకయుండ,
నెవ్వఁడో
సుమ్మి వసంతపుంబెడదఁ జొచ్చె నటంచుఁ బ్రజల్ తలంపరే!

౨

కమ్మని నింబమంజరులఁ గ్రాలు రసం బుడివోవఁ గ్రోలి, చూ
తమ్ము మరందముల్ పరమతత్పరతం దుదముట్టఁద్రాగి, డెం
దమ్ము రహింపఁ బాటల సుధామధుధారలఁ గ్రోలుచున్ ద్విరే
ఫమ్ములు, వన్నెజారు ప్రసవమ్ముల నెంచవు, ముగ్ధవాంఛమై

నిదాఘప్రావృట్టు

౧

గ్రీష్మోర్వీపతి దుష్టపాలనము ఆర్తింగూర్పఁ బ్రావృణ్మహా
భీష్మున్ వేఁడఁ బ్రజాళి, వా రొకటఁ బృథ్విం గాల్పఁజల్లార్పఁగా
సూక్ష్మంబున్ మఱి యుక్కయున్ నెఱపఁగా, హోరుల్,
ఢమల్ బొబ్బలై
కూష్మాండమ్ములఁ బోలి కాలఁ గరకల్, గ్రుంగెన్నిదాఘేశుఁడున్

౨

పరివేషారుణ కాంతిసంచయము లొప్పన్ బండ్లపైబండ్లు గా
నెరుపుల్ ద్రోలెడు ఘట్టనం గలుగు దు మ్మెంతేనియుం గొట్టి, గా
ఢ్పరుగన్, దాఁ బ్రతినేతృసైన్యపతి; యుద్యద్విద్యుదుగ్రధ్వని
స్ఫురితాసారముతో నణంచె జలదంబున్ నేతృసేనానియై

వర్షాశరత్తు

౧

జొన్నపొలంబు మేఁతకయి చొచ్చిన రైతు నదల్చి, పాంథులన్
సన్నలతోఁ ద్వరంగొలిపి, పాగు పతంగములన్ మరల్చి, బ్ర
ధ్నున్నవమేఘ వస్త్రమునఁ దోఁచుచు, దాఁగిలిమూఁత లాడుచున్
సన్నని జల్లులం దనుపునట్టి కనత్ప్రకృతిం దలంచెదన్

౨

జీవనముల్ గడించి జనజీవనముల్ ఘటియించి, ధాత్రి సం
జీవనులై నదీహ్రద విశేషము లొప్పఁగఁ దెమ్మెరల్ దివా
దేవు కుశాగ్రబుద్ధికి గతిం బ్రతిబింబము నూర్మిడోలికా
సేవలఁ దేల్చి యూఁప నతసీప్రకృతిం గని కేలుమోడ్చెదన్

శారద హేమంతము

౧

పంట సమృద్ధిగా నొనరుపం గలిగెన్ భువి, నన్నకీర్తిఁ గై
కొంటకు ఘూలకంధమయి, కొల్లగఁ బాఱెడి శుభ్రనీరముల్,
మింట సితాభ్రముల్, వెలసి, మేని మొదల్ తుదఁదెల్పఁ,దెల్లనై
కంటికి నింపునింపు మిహికాసఖుఁ, గొన్న, శరత్తు నెంచెదన్

౨

ఉండిలేకుండ నొకకొంత యెండకాసి,
వలపు లుప్పొంగఁ దఱపివెన్నెలలు కాసి,
తెఱపి యాకాశమందు నా దినకరుండు
నా కలువఱేఁడు దోబూచు లాడుచుండ్రు

హేమంత శిశిరము

౧

వేఁడికి మోమువాచుటఁ దపింత్రు కుచాద్రి నితంబసైకతో
త్పీడన, బాహుమూలపదవీ కుహరాంతరవాస, సద్వళీ
క్రోడవిహార, దీవ్యదవకుంఠనబంధన, పల్లవోష్ఠ సం
లోడన బాహుబంధన, నిరూఢగృహస్థు లహో యతుల్ బలెన్-

౨

జలములపైఁ బిపాస యది చచ్చెను, బుల్లల నెత్తుపెట్టినన్
నిలువఁడు వహ్ని; మక్కలను నిల్వనఁగొట్టి ప్రచండుఁడై భువిం
జెలఁగుచు,ముక్కుపట్టి ప్రజఁజెంపలుకొట్టెడు, మంచురాజు-దీ
నులఁ గొనవచ్చె వెచ్చగఁ దనుల్ సలుపన్, శిశిరంబు, తోఁజుకై

శిశిర వసంతము

౧

నింబమంజరి, చేదులోని మధురిమము
చెప్పు, నళియోగికి నెడంద విప్పి చూపె-
అ యనాహతశబ్దమే యగును బ్రహ్మ
మనఁగఁ బంచమ స్వరమె కూర్చెను సమాధి

౨

జనమనమ్ములు, పొంగి మన్మనము సాగి
నూతన పరిష్క్రియల సొంపు ప్రీతిఁగూర్చెఁ
గిలకిలల, కుహుకుహుల, ఝుంకృతుల నలరె
వనమనమ్ములు సంసారపక్షమందు-

# శాంతి సందేశము

౧

శ్రుతిపేయ స్వరగీతికా మధురతా సుప్తుండు బాలుండు, వి
శ్రుత నాగస్వర విస్మృత స్వ కుటిలస్ఫూర్తి ప్రసన్నాత్మ తా
గత నాగంబును రాల్గరంచు విలసద్గానాన మై నాడఁగాఁ
బ్రతి జీవాత్మ రసార్ద్రభావ మణుమాత్రం బైన లేకుండునే

౨

కటిక యెడంద యెంత పొడకట్టు కసాయికినేని జంతువో
క్కటి కడు దీనమై యఱవఁగాఁ జెయివచ్చునెచంప? వాని కు
త్కట హననంబె సాజమగుఁగాక, దయామయ బుద్ధిలేశ మెం
తటి తెగుదారికైన నొకనాఁ డయినం దలయెత్త కుండునే ?

3

అరరే మానవజాతి యెంతయును లోకాధారుఁ డైనట్టి యీ
శ్వర సంతానముకాఁగఁ దోడిజను నీభ్రాతన్ సమున్ గ్రొవ్వునె
త్తుచు పాల్గొన్న శరీరి నన్యునిగ నీతోఁ గూడిరానీయ వే
మిర యాధిక్యము నీకు! నీ కులమత స్మృత్యర్థ మిట్లున్నదే?

౪

అల వాల్మీకి మహాతపస్వి సకలాంహోహస్తిసింహంబు, త
త్కుల మేదో గుఱితించితే? కులమె తగ్గున్ హెచ్చురూపించుచో
నిలలోనం దలమానికం బతఁ డెటో యీ? తద్గుణాల్ పూజ్యపా
దులగా శ్రేష్ఠునిగా వచింపకయ; నీ దుర్మార్గ మీ యంతయున్

౫

పగతెల్లం దనకాయకష్టమున కల్పించె ధనంబంది, జీ
ర్ణగృహానం గల యాలుబిడ్డలను బూర్ణ ప్రేమఁ బోషిరచి, హా
యిగ నిర్వ్యాపారహితాత్మతం గడపి, బొం కేనాఁడు, లేనట్టి మా
దిగ యస్పృశ్యుఁడె, యీకులాల కిఁక నేదీదిక్కు సంఘంబునన్

౬

తుద కేదేహికిఁ దోడిమానవుల యందుం బ్రేమభావంబు లే
నిది యేలాగున మానవుం డతఁడు, ప్రాణిన్ హేమరస్యంబుతో
మదిలో నెప్డు సహిష్ణుభావమున సన్మానింపఁ దత్కార్యక
ర్తది మేల్పొంతి యగున్, విశిష్టుఁ డతఁడే తన్మాత్రుఁడే యిద్ధరన్

౭

తురకైనన్ గిరకైన నీ జగతి హిందూజాతి కానీ మఱె
వ్వరె కానీ తనతోడివాని ననుకంపాదృష్టి వీక్షింపడేన్
కరువౌ దేశశుభోదయమ్మును జగత్కళ్యాణ మో ప్రాణులో
ర! రహస్యం బిది; జీవహింస మతశాస్త్రాల్ గోరునే యెచ్చటన్

౮

ఇల నేవాఁ డొకనాఁడు లేనియెడ నీవేలేవొ, యెవ్వాని ని
శ్చల విస్ఫార భుజైకదండమున సస్యశ్యామయై, భూమి, బ
ల్పులకించున్, వశవర్తినుల్ తనకు నెప్డున్ ధాన్యపుంలక్ష్ము,లా
లలితస్వాంతునిదే మహాకుల మదేలాకాదు యోజింపుఁడీ

౯

మతమున్ మంటనుగల్పి తోడినరు సంభావించుచే సర్వస
మ్మతమౌ దివ్యమతంబటం చతని సూక్ష్మంబేని పీడింప, దు
ర్మతమం చీయవి పుణ్యపాపములుగా మాయాసుతుం డన్నవా
క్యతతిన్ నిత్యము నక్షరాల జరుపంగా ముందు రారేలకో

౧౦

నన్నుఁ గొల్వకయున్న మానవుని బట్టి
చంపుఁ డని దేవుఁ డనెనె యే జనునితోడ?
నొక నరప్రాణిఁ గేవల మొక్క భిక్షుఁ
జంపఁగాఁ జేతు లెటులాడు జంతువట్లు?

౧౧

అతిధైర్యంబుగ సాటిమానవుల మధ్యం బట్టెఁ డన్నంబు, పొం
ది తినంగా నిరుకైన చీఁకటుల వీథిన్ బుద్ధికాయాల గ్రు
డ్డితనం బొప్పఁగ వచ్చు దీనునికి ముష్టింబెట్టుటా చంపుటా?
మతవైషమ్య మిటేల పిచ్చుకపయిన్ బ్రహ్మాస్త్రమై పొల్చునో

౧౨

ఒక మహాతత్త్వమూర్తి కలరూపు తెలిసి
మతదోషము వివరింపకయ పోనె ?
ఒకఁడు శాస్త్రపరిశోధకుఁడు నభోంత ని
శ్శ్రేణికా గతుల నిర్మింపకున్నె ?
ఒక మహాకవి యెకాయెకి యప్సరోజనం
బులను దోటీలతో దులుపకున్నె ?
ఒక మహాదేశసేవకుఁడు స్వర్గాంగ సా
రణుల పంటల వంత లణఁప కున్నె ?
కనఁగ నేపుట్ట నేపాపము కలదొ వశమె?
నివ్వు గప్పిన నిప్పులై, భువి మత కల
హోర్మికా క్రుధా రుధిర మహోగ్రఘురము
పాఱి యెందఱో జనులు రూపఱక యున్న

౧3

తనచేయాడునె యన్యమానవుని హత్యంజేసినట్లే స్వకీ
యుని జంపన్ శరుకేని, కాన దయ సర్వోదంచితంబై, యెసం
గును దానిన్ మఱి తోడిమానిసిపయిం గూర్పంగ, నీకేమి త
గ్గును దంష్ట్రీ ! భువి పేరువాసి, మతసంక్షోభమ్ము నీకేటికో ?

౧౪

భవబంధమ్ముల( జిక్కి కాలగతి నిల్వన్ బీదవా(డౌట బి
ట్టు విలాపించుచు( గొద్దియౌ కొలతకూడుం గుడ్డయుం దప్ప, న
న్య విధం బేమియు లేనిదీనుని, గతుల్ నానా(టికి న్మారి, మా
రి విదుల్పుల్ వికృతంబు సేయ ని(క(దంద్రీ! ప్రాణముల్దీయుదే

౧౫

అత( డేపల్లియనుండి యాగతు(డొ భార్యాపుత్త్రుల న్వీడి, యె
క్కట మేతెంచినవా(డొ, పిల్లలట సక్తస్వాంతులై రాత్రి యే
గతి నిద్రించిరొ మూర్త మొక్కయుగమై కన్పట్ట, సంసార వ
స్తుతతుల్ పుత్త్రవియోగభారమును నీతో( జెల్లిపోయెం గదా!

౧౬

నకనకలాడి పిల్లలు మనం బెరియన్ గురువెట్టి, మై నెఱుం
గక పడిపోయినా రొకట, కంచుపు పాలకు వట్టితోళ్ళ నూ
రక బలు చప్పరించి తలప్రాణము తోకను నిల్పియుండె(, ద
ల్లికి నిసువున్న ధోరణియు లేదు, కనుంగొను(డయ్య దుర్గతుల్

౧౭

ఇల్లున్ వాకిలి మంటలో( గలియ, మధ్యేమార్గులై, మూటయున్
ముల్లెం జేతనుబట్టి యీడ్చుకొనుచుం బోలేక సంసారపుం
వాల్లభ్యం బెరియింప, నెండలకు నిల్వన్ నీడయే లేక యి
ట్లల్లాడంగను నేరు కారకులొ యబ్బా దీనియోజింపరే!

౧౮

ఆర్తత్రాణధురీణ రాఘవ! మనుష్యప్రాయునిన్ దేవతా
మూర్తిం జేయఁగఁజాలు నీ మతమె తన్మూర్తిం గిరాతక్రియన్
వర్తింపంగను జేయుటెట్టులొ? మతవ్యాజాన జ్వాలావళిన్
నర్తింపంగను జేయు నెట్లొక గృహానన్ వేఱొకం డిచ్చతో

౧౯

భావి భారత భాగ్యోదయావసరము
ప్రతినరుఁ డనుభవించి తీరంగవలయు
సమతఁ గూడి యుచ్ఛ్వాసనిశ్వాసములను
సలుపవలయును దన సాటిజనుని గాంచి-

౨౦

అసలె వడగాడ్పు జీవన మాహరింప
నమల సామరస్యానపాయ ప్రభావ
సరళ గంభీరరస సరోవర కృపీట
మందు జాల్ రువ్వె నెవఁడొకో యలలురేఁపఁ?

౨౧

జలరుహామోద భరిత కాసారవితతి
స్వామ్య భాగ్యప్రపత్తు లేర్పఱచుకొనుచు
ముజ్జగాలఁ దేజఃకీర్తి మూర్తులయిన
నా ధురంధరగణ రాజహంస లెచట?

౨౨

అమలానంద విశిష్టమార్గములు సత్యాహింస లెల్లప్పుడున్
స్వమతంబై మమతాపహారి యగు జీవన్ముక్తుఁ డెవ్వాఁడొ, యా
యమలస్వాంతుని మార్గమందునఁ దనూయాత్రన్ జగజ్జేయుమా
ర్గమునం జేయుఁడు మీరు,మెత్తఁదనముందాఁ జూపుఱాబండయే

89

# ఎన్నికల సందడి

౧

ఎఱుకువారి లొంప నేడుకొంపల మీద
తురకవారు గలరు, మఱుగుచెంత
దారి డొంక లేదు, తలఁచరు మును, నాఁడె
వెలసె నట మసీదు పీర్లపాక

౨

ఇంతకుఁబూర్వ మెన్నఁడు మఱెవ్వరు తన్నునుకోనులే దటన్
ముంతెడు తప్పఁద్రాగి దినముల్ దొరలించెడివాఁడు, వాడ ర
వ్వంతయు మాట చెల్లుబడి యైనటు తోచదు, నిన్నమొన్న శ్రీ
మంతులు చేయు వందనముమధ్యమ దా మెలివేసె మీసముల్

3

సుబ్బన్న నాయుఁడై చోపుదారులఁగూడి
శోభిల్లె పలువల సుబ్బిగాడు
ఐదేండ్ల క్రిందట నారంభమై నిల్చి
పోయిన బావి సంపూర్ణమయ్యె

గాలిగోపురముపైఁ గన్పించెఁ 'బున్నికి
జై, యను పటము విస్సన్న గట్టె
ఎవరువచ్చిరొ యేమొ యేలకో దేవుని
పూజకు నగరానఁ బూవు లేదు.

కోతి రూపపు బడి కుట్టికుంక మొదలు
నిండువేసంపు నగరాధినేత వఱకు
వెట్టికేకలు తో బొమ్మ పిఱుపులును న
మందముగ సాగె గొఱ్ఱెలమంద గతిని-

౪

పూతిగంధ వర్షి పోత్రి నివాసంబు
సందులో హిమాంబుచర్చ జరిగె
కాళరాత్రిఁ గూడఁ గదలక నిదురించె
జనులు మేలుకొన, పిశాచగణము.

౫

సోలువానివెంట సొళ్లువాఁడును వచ్చె
లేమివాని వెంట బూమెలాఁడు
కామి వెంట మోక్షకామియుఁ జేరి యె
వ్వారి లబ్ధి యేమొ! పంచుకొనిరి-

౬

లోభికిఁగూడ బుద్ధి దొరలుం గద ద్రవ్యముఁ గొల్లబెట్టఁగా
లాభము నెట్టిదాని బదిలంబుగ నెంచెనొ, పాతిపెట్టుచే
యీ భువి నెంచునట్టి మతిహీనుఁ డతండు, ధనంబుమూటలున్
వైభవ మొప్ప దాతగ నవారిగఁ బంచుట కాననయ్యెడిన్

౭

నిన్నటిదాఁక వైరియట స్నేహము పొంపిరివోవ నండయై
నెన్నడుమున్ బిగించె నొకనిన్ గెలిపింపఁగ వేఱొకండు, సం
పన్నగృహస్థు నింటఁ దలఁపం దలలొక్కటికాక యుందఱున్
భిన్నులునైరి, దంపతుల నెమ్మదులం దిడెఁ జిచ్చు నెవ్వఁడో

౮

కమ్మనినోటఁ గై పెనఁగు కాఁపులు, ధూర్తులబారులెచ్చటన్
గ్రుమ్మఱు డొక్కకారులు, నకుంఠితచోరులు, చెడ్డపోరులున్
దొమ్మికిఁ డీయు దారులు పదుల్ తెగఁబంచెడు దానవీరులున్
సమ్మెల పెట్లదిమ్మెల ప్రచారవిధమ్ముల పెక్కుతీఱులున్

౯

అంతకుముందు పేర్వడసినట్టిది యాపురిఁ బూటకూటి యిల్
కొంతకుఁగొంత వంటకములోపము సహ్యము, నాఁటి పాడబం
బెంతని చెప్పవచ్చును, విహీనము నీరముకంటె - నీరు తాఁ
గొంత రుచిన్ ఘటించుఁ గనుగోన్ సుజలంబుల నుప్పునీరముల్

౧౧

రాజోద్యోగియొకండు చూపెడిని సంరంభంబు లే వ్యంగ్యమో!
మోజుం జూపు, సహాయము న్నెఱపు, సంపూజించుఁ దా నొక్కనిన్
మాజీమంత్రికిఁగాఁడుబంధువు, మహామాన్యుండునున్‌గాఁడు, రా
రాజా అన్నునుగాఁడ - ఆమిషము నోర్వంబోఁడు తా నెన్నఁడున్

౧౧

ప్రియ వధూవరులే లేని పెండ్లివిందు
నంబి, దేవుఁ డుండని తిరునాళ్ల సొబఁగు
ప్రకృతిసిద్ధంబు గానిదౌ పండుగ రొద
త్రికరణంబుల పొత్తులేని కుతుకంబు

౧౨

వెదకికొనివచ్చి యింటికిఁ
బదిలముగ నమస్కరించి, వాహనము పయిన్
మృదుభాషణములఁ దెచ్చిన
సదయుఁడు పనియైనపిదప సలుపఁడుపలుకేన్

౧౩

మాటల కిటుకుల యిటుకల
కోటలు, వికటాట్టహాస కూటంబులునున్
మాటికిఁ జిటికెలపందిటి
యాటలకట్టంపు లమరె నతినాటకముల్

౧౪

పట్టపగటిని, బదిమంది బ్రహ్మవిదుల
నట్టనడిమిని జెవి కనుల్, పట్టువిడక
గుట్టు కనుగొనుచోటఁ, జిక్కువడి నిల్చె
ధర్మ దేవత గ్రుడ్డియద్దాలు పెట్టి-

౧౫

ప్రకృతిదేవత కట్టిన రంగుచీరె
నహహ దువ్వల్వయని కొనియాడినారు
సత్యదేవుఁడు కనవచ్చెఁ జాకలియయి
చదువుకొన్నట్టి వారలు చదికిలఁబడ-

౧౬

ధర్మదేవత గొంతెండి తల్లడిలఁగ
స్వార్థపరులైరి సొంత డబ్బాలవారు !
చల్లనీరిడె సత్కవి తల్లజుఁ డట
ఆమె పాదాలె యాశ్రయ మనెడివాఁడు.

౧౭

లోక మెఱిఁగిన సుబ్బి చెల్లుబడి యయ్యె
రంగరావుగఁ, గనులఁ గారమ్ము చల్లి-
పేరిసెట్టి గతించెఁ దా విక్రమమునఁ
బ్రజల కొనితెచ్చి, రతనిఁ బరాభవమున-

౧౮

వెంకన గెల్చునం చొకఁడు వీరన గెల్చు నటం చొకండ్డునుం
బొంకముతోడఁ బందె మిడి, పోయినపందెపుడబ్బువాఁడు, ని
శ్శంకగఁ గొట్ట, గోలయయి చచ్చిరికొందఱు, నేస్తులైరి పో-
వెంకన వీరనల్, పెరిగెఁ బెద్దయువైరము లేని తావునన్

౨౯

గెల్చినఘనుండు శిఖర మెక్కినది లేదు
ఓడిన జడుండు పాతినజాడ లేదు
ప్రజలు మాత్రము తెలివిని బడసినారు
ఎన్నికల సత్యమేదొ చింతించినారు !

# ధూర్త కాలము

౧

నీ నా మధ్యను జేరి కాల మది వర్ణింపంగ రానట్టి, మా
యా నైపుణ్యముఁ జూపి, బుద్ధిగత సమ్యగ్భావ సాంగత్యమున్
రానీకుండఁగ నెంత పాటుపడి, స్వార్థం బన్న బీజంబు, చి
త్తానన్ నాటి మహాప్రచండతఁ బ్రభుత్వ మ్మేలునో చూడుమీ

౨

నన్ను దరిద్రుఁజేసి ధననాయకు నిన్నొనరించి, పిల్వఁగాఁ
గన్నటు లెత్తనీక పటు గర్వమహాంధ తమోవిశేష సం
ఛన్నునిగా ఘటించి నడిసంద్రమునన్ ననునెట్టి కాఁపురం
బు న్నడిపింపు మంచు వెఱపుం గలిగించుచుఁ బ్రొద్దుపుచ్చెడిన్

3

జవసత్త్వంబుల, లేమి కూల్పఁగఁ, గనిష్ఠభ్రాత కొంపన్ యవా
గువుకై గోడు లరణ్యరోదనము భంగుల్ గాఁగ, వైవాహికో
త్సవ సంబంధి రసాన్నతృప్తజన బేత్కారమ్ము మిన్నంట, శ్రీ
మివులున్ జ్యేష్ఠునియింటఁ జెంగటనె సుమ్మీ! ధూమికాలం బహో

౪

ప్రథిత హేమంతశైత్య భార వహ పవన
చాలనమ్ములఁ గట్టువస్త్రమ్ము లేని
హీనజాతిని మోదాబ్ధిలోనఁ దేల్చి
పట్టి వేధించు ధనికు నుబ్బనపురోగి-

౫

కట్నముల గ్రహించుట పాతకముగఁ దెల్పి
తనయుకు వరున్ ఘటించిన తత్త్వమూర్తి
నోటఁ గొమరుని పెండ్లికై కోటులెన్నొ
బేరమాడించుఁ గట్నమ్ము విహితమనుచు-

౬

దొడ్డవారిని రండని దొడ్డిచూపి
దొంగసరకుల నందించు భంగినేర్పి
గవని ముందు లేవను ఫలకంబుఁ జూపి
నోరు లేనట్టివాని దీనుని మరల్చు.

౭

దోషి యెవ్వాఁడొ వాని నిర్దోషిఁజేసి
పరమశత్రులఁ దుదఁ బ్రక్కప్రక్కఁ జేర్చి
కన్నుకనకుండ 'బుద్ధిబుగ్గ, మెలివెట్టి
నాటకమ్మాడు కాల దుర్నయ పరుండు.

౮

పిచ్చి ధర్మదేవత నెట్లొ చిచ్చికొట్టి
కాలుత్రవ్వంగ ధనలక్ష్మిఁ గన్నుమలిపి
మంచితో లంచమింత తిన్పించి దేవు-
'నిన్న' రానీక 'నేఁడు' కన్పింపనీక
చాకచక్యము నెఱపు దుష్కాల మరరె!

౯

నాకనిశ్రేణి నెక్కెడునట్టి తపము
ఘోరముగఁజేయు యోగంబుదారివాఁడు
మునికి, ఘటియించుఁ జేతిపట్టున సుగంధి
మృదుమధుర శైత్యమూర్తులఁ బృథుకుచముల-

౧౦

ఇప్పు డిటువచ్చిపోయె, జ బ్బేమి లేదు
ఎవ్వ రనుకొందు రంతవాఁ డిట్లగు నని
వయసు చిన్నది, యెట్టిపాప మ్మెఱుఁగఁడు
పరమయోగ్యుం డయ్యారె! కన్పడఁగఁ బోఁడె-

౧౧

వఱపు గలచోటఁ దత మేఘపంక్తి నిలిపి
యుఱుము మెఱుపుల నుసికొల్పి, యొఱపు చూపి
యాశలను రేఁపి యొకచిన్కు నచట దులిపి
మబ్బు తెరపాపి, వెకిలిగా మరలినవ్వు

# అంకితము

పితృపాదులు కీర్తిశేషులు

శ్రీ జాలరామయ్యకు-

౧

నీ నవనీతకోమల మనీష శివార్చనయందు రోగిసే
వా నిరతిన్ ద్విజాతిథి సపర్యల నెంతగ రాణ కెక్కెనో
ఆ నెన రంతొ యింతొ తనయత్రయిపైఁ బ్రసరించెఁ దానఁ దం
డ్రీ! నిలువంగఁ దింటకు ధరించుట కయ్యెను దైవికంబుగా

౨

ఇంత శ్రమన్ సహించి గడియించి సుతాళికిఁ బెండ్లి బేరఁటా
లింతగఁజేసి కాఁపురము నీదఁగ శక్తి ఘటిల్లగానె నీ
వంతును వెళ్ళఁబుచ్చుకొని స్వర్గముచేరితె తండ్రి! నీఋణం
బెంతని తీర్చువారల మిదే కృతిఁ గైకొను మంకితంబుగా

3

సతత సంధ్యా జపాద్యనుష్ఠాన ధీ ని
ధాన నైర్మల్య శోభాయమాన మూర్తి
ననఘు మహితాత్ము జాలరామయ్య తండ్రి
మరువ నేర్తునె జన్మజన్మములకైన

౪

శాశ్వత బ్రహ్మలోక వాసమునఁ దండ్రి!
వెల్గుచుందువుగాక! పవిత్రమైన
నీ స్మృతికిఁ జిహ్నముగ హవణింతుఁ గృతిని
వినుత తులసీ మతల్లి సేవింపనిన్ను—

# ఆక్రందనము

౧

ఈ లోకంబు సృజించి తేల, సరెపో, యీరీతి జీవాల నీ
వేలా పొట్టను బెట్టుకోఁగఁ దలఁతో యీ వ్యాఘ్రిచందాన, నీ
లీలల్ నేఁటి కిటుల్ ఫలించెనొ, మదూళిం ద్రాగితో, లేనిచో
స్త్రీలన్నన్ నిరసింతొ కావఁగను నీచేఁ గాదొ నీ సంతతిన్

౨

ఒకనాఁ డెక్క సతీమతల్లి జనబంధూ! మానభంగంబు కొం
కక చేయం దలపెట్టెనొక్కఁడు, నను గావంగదేయన్న నా
మెకు వల్వల్ దయచేసి ప్రోచితట సామీ! నేఁడు మాకట్టి ఘా
తుక దుర్జేయ మహావ్యథాకర విపత్తుల్ గల్గ రావేలకో

3

అమరన్ సత్త్వగుణ ప్రధానహృదయాలం దే వసిం తెప్డు, క్రో
ధము వర్జింపుఁ డటంచుఁ బల్కితట వేదాలందు, మావారు, చి
త్త మటే నిల్పిరి, దుండగీంద్రకు విరుద్ధంబద్ది, యవ్వారమాం
తముగాఁ జంపిరి వేనవేలప్రజలన్ దౌష్ట్యంబు రూపించుచున్

౪

మతిలో భూతదయాపరత్వమున యుష్మ త్పాదపద్మ ద్వయిన్
సతతంబున్ భజియించు మా మగలు సంసారంబులన్ దిద్దుకోఁ
జతురాత్ముల్, పెఱవారిపైఁ గలన కీషణ్మాత్రముం బోరు, పో
రు తలంపే చొరనీరు సజ్జనులు కోల్పోఁజూతువే ప్రాణముల్

౫

అరరే యొక్కనిఁ బెక్కుముష్కరులు హత్యంజేయుటా? యందు దు
ర్మరణంబున్ ఘటియించుటా పరులధీరత్వంబు పుంభావమున్?
స్థిర సౌదర్యము, సౌమనస్యమును జాతిక్షేమ మర్థించి, చూ
పరె మా యీప్రజ లల్పసంఖ్యులగు నీ పక్షాలపై నొక్కెడన్

౬

దేవా! దుష్ట కరాళహస్తములఁ బుత్త్రీపుత్త్రులన్, భర్తలన్
యీవచ్ఛక్తిని గోలుపోయి వెత దేహాలమ్మి, జీవించుటే
నా వైధవ్యముతోడ మ్రోడులవిధానన్? దోన నీజాతి ని
ర్జీవంబై నశియించుటేన? యరరే వీలుంగదా గుండియల్.

౭

ముప్పదికోటులౌ భరతపుత్త్రులు చేతనువాతఁగాక, మా
తిప్పలఁ జూచుచుండి వెతఁదీర్పక సంఘమునుండి త్రోచి,బల్
ముప్పున ముంచివేఁతురు మమున్శివ!యిందుల మాదియేమిటో
తప్పు తురుష్క హస్తమును దాకిన దోషమొ పెన్గులాటలో-

౮

మాపున్ జేపును శాలిధాన్యమునకై, మాగిళ్ళలోఁ బుచ్చి యొ
ప్డో పంచన్ శయనించి యేగు దురదృష్టుంగర్షకున్, స్వీయ సం
తాపంబున్ వెలిఁబుచ్చువానిఁ గని మొత్తం జేతు లెట్లాడెనో
పాపీ! కాతర కంపితాంగుఁడయి నిన్ బ్రార్థించు నప్పట్టునన్.

౯

స్మేరావ్యక్త మధుస్వరోచ్చల దతిస్నిగ్ధాంగ విన్యాసకే
ళీ రాజచ్ఛిశు వేమి కీడొనరుచున్, లీలాసుధాంశుక్రియం
దోరంబౌ నవవెన్నెలల్ గురియు, ముద్దుల్ మూటలంగట్టు, లే
దే రూపించును హాస్యలాస్యముల నిం దేతప్పొ మాయింపఁగన్

౧౦

అరె మీక్రోధము పూరిపాకపయి నిప్పై, గ్రామసంబంధ బా
లురపై శాతకుఠారమై, పరసతీలోకాన, దుర్వార దు
ర్భర కామాతురతాప్రచండమయి, స్వర్ణస్తేయ నిస్తుల్యమై
హర! మా యీ నవఖాళి పాలిట మహా హాలా హలం బయ్యెగా!

౧౧

దుర్మరణవేదనా క్షుభితోర్మి కంధి
పాంథసముదయ గద్గదస్వర విశేష
రోదనావ్యక్త నిర్గతోరుధ్వనుల్ ని
రంతరమ్ము మీ కవి గిలిగింతలయ్యె-

౧౨

హర! పరమాత్మ! నీవు త్రిపురాసురులం దెగటార్చినట్లుగా
బిరుదు గడించినావంట, పవిత్ర పురాణములందు వ్రాఁతలోఁ
బరగిితి వింతెపో, యది ధ్రువం బగునేని నమాయికప్రజా
మరణము లేల గల్గెడి నమానుష చిత్రవధప్రధానమై

౧3

వలసిన తిండిగింజ కొఱవడ్డను గంజికి రాణివంటిదై
వెలసిన 'రాణిగంజి' నిజవేషము మంటను గోలుపోయి, నా
శిలఁ గతమేమి? తన్నికటసీమలు దుఃస్థితి పట్టనేలొకో
తెలుపగదయ్య యీప్రజలు దిక్కఱి ప్రాణములం ద్యజింపఁగా

౧౪

బహుళ ఫలసస్య జీవనాస్పద విభూతి
కలిగి, పట్టినదెల్ల బంగారమౌ వి
శేష నుత సారవన్మహాక్షేత్రమందు
నెవరు చల్లిరొ దుర్బుద్ధి నింగలములు

౧౫

తాను తిన్నంత తినఁగ నెందఱికొ పెట్టు
నంత గలది యీ పంటవలంతి కలిమి
కూడు గుడ్డకు లోటు పైకొనె నిదేమి ?
యే కుమతి చూడలేక ఫోయెనొ యిదంచ?

౧౬

అని వాపోవుచుఁ జెట్టుగుట్టలకుఁ దామై కంటికి న్మంటికిన్
ఘన తాపంబుగ వానకాళ్ళగతిగాఁ గన్నీరు కాఱంగ న
వ్వనితాలోకము, దిక్కులేనిదయి యేవా రేరిచేఁ జిక్కురో
యని మూర్ఛిల్లె నిసర్గపూరుష గహీయచ్ఛాయలో నొక్కఁడై

# అభిశస్తి

౧

అవ్వి యాంగిలేయులు భారతావనిఁ బరి
పాలనము చేయునాళ్ళు, తత్ప్రభుత నెఱపు
సార్వభౌములు భారతజనుల యెల్ల
నోళ్ళు బిగగొట్టి కొంపోవునాళ్ళు, ధనము.

౨

తనది దేశము, దాని పెత్తన మొరులది
తనది వారంది, వారుపెట్టినఁ దినవలె,
నిది మదీయమని యనఁగూడదు ముఖాన,
దొరల కడ్డు చెప్పఁగరాదు కరములీయ-

3

అన్నిటనుజూడ వారె ముఖ్యాధికారు
లెవ్వరును వణిజ్యము స్వతంత్రించిచేయ
రా దితరదేశములతోడ, రాజునాజ్ఞ
శిరసున ధరింపవలయు దుర్భరమైన

౪

ఉప్పుపైఁ బన్ను కాదను టొల్లఁబడదు
మన మసితులము, సేవచేయనె జనించి
నార మని వారిసిద్ధాంత మేరినైనఁ
జులకనఁగఁ జూతు రెచటఁ గుక్కలవిధాన.

౫

తినుట మనదియె వేఁపుకతినుట మనల
నెవ్వరిని గన్న వారికి సేవగింత
యరరె స్వస్థానమున నన్య యాజమాన్య
మైనఁ బరదేశమున స్వీయ మనున దున్నె ?

౬

ఇట్టి పరపాలనమ్ము సహింపలేమి
రగిలె చిత్తమ్ము లందు బుద్ధిగలవార
లర్థము గ్రహించి రాజకీయముల నెఱిఁగి
ప్రతిఘటించిరి శిక్షణక్రమ రహితత-

౭

ఎదిరి తలపడి రట సిపాయీజనమ్ము
ప్రాణముల బలినిడిరి స్వప్రభుత నెఱపఁ
దలఁపులు జనించె నుద్భిజ్జముల క్రమానఁ
గనుటె త్రెంపిరి కల్పుమొక్కల విధాన.

౮

రెండువంద లబ్దమ్ము లీరీతి సాగ
దేశభక్తుల ప్రాణాలు దివికిఁబోఁగ
దీని తత్త్వంబు తెలిసి గాంధీమహాత్ముఁ
డొకఁడు తలపెట్టె, సత్యాగ్ర హోద్యమంబు-

౯

అది, యహింసాత్మకము, దాన నతఁ డెదిరిచి
యన్యవస్త్ర బహిష్కరణాత్తబుద్ధి
శాసనోల్లంఘనము సహచరులతోడ
నింటియింటికిఁ దిరిగి కావించినాఁడు.

౧౦

చిదుకఁగొట్టిరి, కాల్చిరి, చెఱనుబెట్టి
రతిభయంకర లీలఁ బ్రజాళి హూణు,
లన్నిటిని శాంతియుత మహోద్యమముతోడ
నోర్చెదరెకాని పట్ట రాయుధముచేత.

౧౧

ప్రాణములమీఁద నాశ యావంతలేదు
దేశమును వీడిపొండోయి తెల్లదొరలు!
మాది మా కిచ్చి యని పలుమారు లనఁ దొ
ణకరు పూనెదరు నిరశన వ్రతంబు-

౧౨

ఇటుల నలువదియేండ్లు క్రమింపఁగఁ బ్రతి
భారతీయహృదయ పరివర్తనంబు
కాఁగఁ బ్రతిజీవి నోట మాఱ్మ్రోగె రవము-
దేశమును వీడిపొండోయి తెల్లదొరలు'-

౧3

ఆంగిలేయులు సహజ మాయాప్రభావు
లతులిత కుతంత్ర రాజకీయప్రవీణు
లిల పయోముఖ విషకుంభహృదయు, లెత్తు
వేయు టన్నది వారిసొమ్మె యెచటను

౧౪

దేశమున భాగ మీయరు లేశమైన
మీకు మేమేగిన క్షణమ్మె, మీరు దానిఁ
గోరుఁ డని తురుష్కుల రెచ్చఁగొట్టినార
లంద ఱేకంబుకం డిత్తు మనిరి పైకి-

౧౫

అదియె గాంధీకి వాంఛనీయ ప్రవృత్తి
దేశవిభజనము మహమ్మదీయు లడుగ
వలదని యతండు మాకుఁ గావలె నటంచు
వారు, కాలంబుపుచ్చఁ దత్త్వము నెఱింగి

౧౬

ఆంగ్లనేతలు వారి మధ్యమునఁ జేరి
తేల్చికొనుఁ డంచు మనలఁ బ్రార్థించినారు
సోదర ముసల్మను లిఁక ధిత్సువుల వలను
బడిరి మాకు 'పాకీస్థాను' వలయుననిరి

౧౭

స్వీయపరిపాలనమ్ము వాంఛించి, ప్రేరి
తౌత్తరాహ మహమ్మదీయ ప్రముఖులు
స్వీయఖండాంత రాన్య జాతీయజనుల
రూపుమాపిరి యూరుపేరులు నశింప

౧౮

అది మహమ్మదీయ జన రాజ్య మని తెలుప
వారి రాజ్యస్థ హైందవప్రజల, స్వల్ప
భాగముల నాక్రమించి స్వప్రతిభ నిలుప
పూని రీరీతి భయద మార్గాన నడువ-

౧౯

పిన్నపెద్దల స్త్రీల విప న్నిపాత
హైందవుల చిత్రవధచేసి యాక్రమించి
రచట హిందువు మందున కైన లేఁడు-
అచట హైందవసతి మచ్చు కైన లేదు-

౨౦

శకటమునఁ జనియెడు ప్రయాణికులు నింట
నున్నవారలు, బాహ్యమం దున్నవార
లెచటి వారంద ఱచటె పోయిరి మృతులయి
కత్తివ్రేటుల నెత్రుల కాల్వపాఱ.

3114

# అభిశోచనము

౧

అట్టిచో రాత్రియనక భయంబు దక్కి
యడవులం బట్టి పోయిన యతివలంత
నొడలు తెలియంగఁ గూర్చుండి యుండునంత
పెంటితో నున్న మగలేడి కంటఁబడియె

౨

దానింజూడగ నెదియే
మానసమునఁ దట్టెనేమొ మగువయొకతె యా
స్త్రీ నివహమ్ముఁ భయంపడ
గా నీరీతిని వచించెఁ గన్నీరొలుకన్.

3

హరిణీ! హరిణి! నీదు భర్తగల శయ్యంజేరి యేప్రొద్దు, తు
త్తర తీరం దృణ మింతమేసి సుఖనిద్రం బోదు, వీవెంత కా
తరచిత్తంబు కలట్టిదాన వయినం దత్సర్వము స్వీడి, నీ
పరమానంద పరీతచిత్తము నరవ్రాతంబునం గల్గునే?

౪

జలముల నెల్లఁ బీల్చెడి ప్రచండతరాంశు నిదాఘ దీర్ఘ వే
ళలనయినం బ్రశాంతగతులన్ ధవు పజ్జనుఁజేరి పుత్తు శా
ద్వలముల నీ వనీస్థలిని బండినచోటె నివాసభూమిగాఁ
దలఁచుచు లాఁతిచో టను విధం బణుమాత్రము లేకనిచ్చలున్

౫

నేతుల పిండివంట మహనీయ సుధారుచిరాన్న షడ్రసో
పేతము, పంచభక్ష్య దధిపిచ్ఛిలరూపము, భర్తృసన్నిధిన్
మూతిని నున్న శుష్కతృణమున్ సయితమ్ము మృగీవధూమణీ!
ఈ తనుపోషణమ్ము గన నీతనికోసమె కాక యేలొకో

౬

నీగతి యేమియౌను హరిణీ! యొక బెబ్బులి వచ్చి పడ్డఁగా
నీ గుహనుండి బిట్టఱచునేని ననాథగ నీవు గ్రోలుచో
నాగడెలోన ప్రాణమును ద్యాగముచేయుదొ? మేతె, యాతనన్
దోఁగుటకంటె మావలె మనుష్య కరాళమృగమ్ము చేతిలో

౭

ఈ దురితాత్ము లేమి గడియింతురొ మాదగు పండువంటి ము
త్తైదువ జన్మ రూపఱిన దైవమ! కూటికి గుడ్డ కౌనె త
న్మేదుర మాంసపిండము, జనించిన యాకఁలి తీఱఁ జంపువ్యా
ఘ్రాది కులంబు మేలుగద! యాపయిఁ జూడదు జీవకోటులన్

౮

కలిగినమట్టుకున్ మెసవి ఘాతుకజంతు వనాననైన వి
చ్చలవిడిగాఁ జరించుటకుఁ జాలి విరోధి జనంబు పట్లఁ గ్రో
ధ లవము లేక, సాత్త్వికపథంబున వర్తిలుచున్న, లేళ్ళజ
న్మలు భువి నెంతధన్యములొ! హానుట పోషకు లౌట వింతయే

౯

తగులము దవ్వుచేసి యిటఁ దాపసవృత్తిఁ జరించు మౌనులం
దగ భజియించు చాశ్రమపదంబునఁ గాలము వెళ్లఁబుచ్చుటల్
విగతమహార్తి దివ్యపదవీ సముపార్జన భాజనంబు ల
ట్టి గురుపదంబు లెట్లు ప్రకటీకృత బాహ్య తలంబులోఁగదా!

౧౦

ఆ మునివేషముం గని మహా మహిమోద్ధత తత్ప్రదీప్త బో
ధామృత మాను భాగ్య మెపుడా యని యర్ధనిమీలితాక్షి కాఁ
గా మృగదంపతుల్ తెలుపుకైవడి మార్గముఁబట్టి పోయె నా
లేమ యపాంగదృష్టులు-దలిర్పగఁ జూచెఁ బడంతిపిండుతో

# ఆలంబనము

౧

నిండు చందురుఁ బోలు దండి మొగంబున
బ్రహ్మతేజస్సు తీపారు వాఁడు
మోకాటిపైకి బల్ ముడిచిన ముదుక బ
ట్ట గలాఁడు చూడ బట్టతల వాఁడు
ప్రతివాక్య భావపద్ధతి పొంగి పొరలిన
బోసినవ్వులఁ గొల్లబోయు వాఁడు
శాంత్యహింసాదిక సద్గుణమ్ములు పండి
యమర బంగారు రూపైన వాఁడు

కఱ్ఱ యొకచేత మఱి ఘటీకార మొకట
ననుచరజనంబు లొకట సాయపడుచుండఁ
గదలి వేంచేసె నవఖాళి గ్రామమునకు
నమలకారుణ్య వృద్ధసన్న్యాసి యొకఁడు

౨

ఒకచోఁ బ్రార్ధనచేయు రాఘవుని, గీతోక్తప్రకారంబుగా
నొకచోఁ జేయుఁ, గొరాన్ ప్రకారము రహీమొక్కండె దేవుండుగా
నొకచో, నిల్వక వాడలన్ని తిరుగున్ యోగీశ్వరుం డాతఁ డా
సుకృతాత్ముం గనివిందమేమనునొ యంచుం దుర్కలేతేరఁగా

3

కని యో సోదరులార! యీ కుటిలతతుల్ గాలంగ నేమాయె, మీ
జన మేమైరిట తోడిసోదరులు, సంచారంబులే లేవు వాం
ఛ్రను మిమ్మున్ సృజియించినాఁడు మన 'యల్లా' కాదె; దుష్కీర్తి వ
చ్చును గాదే యిటులిండ్లుకాల్పఁగఁ గొరాన్సూక్తిప్రకారంబుగా

౪

ఏరీవారలు తోడితెం డిటకు మీ కేమైన కష్టాలఁ జే
కూరం జేసినఁ జూత మిప్పుడు, వృథా కోపాలు మీకేల, యా
శ్రీరాముండు మనుష్యకోటి సమదృష్టిన్ సృష్టిచేసెం గదా
యేరిం జంపిన రక్తమాంసముల ప్రోవే గాదె మీ కబ్బెడిన్.

౫

అని వాపోవఁగ నాఁటినాఁటికిని సత్యాన్వేషు లౌచున్ ముస
ల్మను లేతెంచిరి లెక్కకెక్కుడుగ, మూలల్ ప్రాకె నీవార్త, తో
డన యందందుఁ గలట్టి హైందవులు వాడంజేరి, యా యోగి ము
ఖ్యుని చుట్టున్న తురుష్కులం గలిసి వాకోఁజాలి రప్పట్టునన్.

౬

వనములం బట్టినట్టి యా పడఁతు లెల్ల
వినిరి సన్న్యాసిరాక, తోడన యచటకుఁ
జని విలాపించి రొక్క పెట్టునఁ బయిఁబడి
రోదసీగహ్వరమ్ము మార్మ్రోగ రవము,

౭

అం దొక్కతె ముసు వనిలో
వందిరినది కడుపుఁజిచ్చు భరియింపఁగ లే
కందఱి మధ్యంబున నా
క్రందించెం గడు యతీశ్వర సమక్షమునన్-

౮

ఓసామీ! యభమున్ శుభం బెఱుఁగునే యోషిజ్జనం బెప్పుడున్
మాసర్వస్వము మంటలోఁగలిపి,మామాంగల్యము ల్ద్రెంపి,యా
పై సిందూరము మట్టిలోఁ గలిపి మా వల్వల్ బలాత్కరుత్రై
చేసేఁతన్ వదలించి రిట్టి కుమతుల్ ఛెన్నొంధఁగాఁ జూతురే-

౯

ఎంచరొ హైందవాబలలు హీనతఁ బొక్కుచు నున్నవారలీ
మందుల యిండ్లలోఁ బరువుమానములన్ డిగనాడి, యోయి క
ర్మంది! తదీయభామలను 'మా' యనునట్లు వదల్పుమయ్య.మీ
రందఱు నిగ్రహింపఁగ సమర్థులు మమ్ములఁ గావఁగా వలెన్.

౧౦

ఎంతని చెప్పవారము మునీ! మిముఁ గాంచఁగ ధైర్యమంది, నేఁ
డింతకు రా బయల్పడితి మీ యడవుల్ మముఁగాచె, నెన్నడో
యింత భుజించినాము, గతియేమి యిఁకన్, ధవులేరి, చూపి ర
క్షింతువయేనిఁ బుణ్యమగుఁ జేర్పుము మమ్మిఁక మాగృహాలలో

౧౧

ఈ దురితాత్ము లేమి గడియింతురో, మాదగు పండువంటి ము
త్తైదువ జన్మ రూపఱఁగ దైవమ! కూటికి గుడ్డకౌనె ? త
న్మేదుర మాంసపిండము జనించిన యాఁకలి తీఱఁ జంపు వ్యా
ఘ్రాది కులంబు మేలుగద! ఆపయిఁ జూడదు జీవకోటులన్.

౧౨

సారాసార విచార కావు మని రక్షాబంధముంగట్టి యా
కారుణ్యాత్మక యోగిపుంగవు మనస్కారంబుతోడన్, నమ
స్కారం బా సతిచేయ నాతఁడు కడుం గన్నుల్ నిమీలించి, వ్యా
హారించెన్ స్మయమానమానసుఁ డభీష్టావాప్తి రస్తం చిటుల్

# బోధామృతము

౧

శ్రుతిపేయ స్వరగీతికా మధురతా సుప్తుండు బాలుండు, వి
శ్రుత నాగస్వర విస్మృత స్వకుటిల స్ఫూర్తి ప్రసన్నాత్మతా
గత నాగంబును రాల్కరంచు విలసద్గానాన మైనాఁడఁగాఁ
బ్రతి జీవాత్మ రసార్ద్రభావ మణుమాత్రంబైన లేకుండునే ?

౨

కటికయెడంద యెంత పాడకట్టు కసాయికి నేని జంతువొ
క్కటి కడు దీనమై యఱువఁగాఁ జెయి వచ్చునె చంప, వాని కు
త్కట హననంబె సాజమగుఁగాక ! దయామయ బుద్ధిలేశ మెం
తటి తెగుదారికైన నొకనాఁడయినం దల యెత్తకుండునే ?

౩

ధనచింతన్ సుకుమారు చిత్రవధ నిర్దాక్షిణ్యుఁ డొక్కండు చే
యును, వేఱొక్కఁడు స్వోదరంబుకయి తీయున్జంతుప్రాణాలు తె
ల్వని నింకొక్కఁడు రెండుజుట్లకుముడుల్వెట్టించి కొంపల్ మహా
ఘనుఁడై ముంచెడి మధ్యవర్తిపదవీ కాపట్య సర్వస్వమై

౪

ఒకప్రాణిం దనపొట్టఁబెట్టుకొన నుద్యుక్తుండునై చంపువా
నికి నన్యంబగు దుష్టభావమది దానిం జంపుచో నున్నదే ?
సకలజ్ఞుండయి తోడిమానవుల హింసాసక్త దుర్బుద్ధిఁ గొం
కక నాశంబొనరించు వాని మతి దప్పు వ్యర్థమై పోవదే !

౫

ఇరువురిలోఁ గసాయి కెదియేనియు జేసెఁడు బక్క పొట్ట క
క్కుఱితికి దారిచూపి యిడి క్రూరవధన్ మరలింపవచ్చు, దు
ర్మరణము ప్రాప్తమైనను పరాయి పజం దలక్రిందు చేయకే
మఱవఁడు మధ్యవర్తి, ఘణి మందు కనుఁగొనుం డా కుబుద్ధికిన్

౬

సఖ! మనసంఘముం దతఁడు సభ్యత కాంచఁగ నర్హుఁడై పయో
ముఖ విషకుంభమైన జనముఖ్యుఁడు, కేవల నిర్ధనుం డతం
డు ఖలుఁడు,నీసమాజము కడుంగడుఁ గ్రుంగెనుబౌరుఁడాముఖా
ముఖి పలుకంగ నీమతము మోసపుగుండము, సుళ్ళుచుట్టెడిన్

౭

చెప్పున దొక్క మాట యయి, చేయున దొక్కటియై, ఛలోక్తి మీ
మెప్పులె పొందుచుం దగవు మీకె ఘటిల్లఁగఁజేసి, పెంచి, బల్
తిప్పలు, పెట్టి, కొంపలను దిన్నగ మ్రింగెద రెంచరోయి, నీ
తిప్పలు, నీదు భార్యకగుతిప్పలు, బిడ్డల రోదనధ్వనుల్ ...

౮

అరరే మానవజాతి యంతయును లోకాధారుఁడైనట్టి యీ
శ్వర సంతానముకాఁగఁ దోడిజను నీభ్రాతన్ సముం గ్రొవ్వనె
త్తురు పాల్గొన్న శరీరి నన్యునిగ నీతోఁ గూడిరానీయ వే
మిర ఆధిక్యము నీకు, నీ కులమతస్మృత్యర్థ మిట్లున్నదే?

౯

అల వాల్మీకి మహాతపస్వి, సకలాంహో హస్తి సింహంబు, త
త్కులమేదో గురుతించితే? కులమె తగ్గున్ హెచ్చు రూపించుచో
నిలలోనం దలమానికం బతఁడెటోయీ! తద్గుణాల్ పూజ్యపా
దులగా శ్రేష్ఠునిగా వచింపకయ, నీ దుర్మార్గ మీయంతయున్

౧౦

పగలెల్లం దన కాయకష్టమున కల్పంబౌ ధనంబంది, జీ
ర్ణ గృహానం గల యాలుబిడ్డలను బూర్ణప్రేమఁ బోషించి, హా
యిగ నీర్ష్యారహితాత్మతం గడపి, బొం కేనాఁడు లేనట్టి, మా
దిగ యస్పృశ్యుఁడె యీకులాల కిఁక నేదీదిక్కు సంఘంబునన్

౧౧

తుద కేదేహికిఁ దోడిమానవుని యందున్ మానత్వంబు, లే
నిదె యేలాగున మానవుం డతఁడు; ప్రాణిన్ సామరస్యంబుతో
మదిలో నెప్డు సహిష్ణుభావమున సన్మానించుఁ దత్కార్య క
ర్తది మేల్బంతి యగున్, విశిష్టుఁ డతఁ డేతన్మాత్రుఁడే యిద్ధరన్

౧౨

తురకైనన్ గిరకైన నీజగతి హిందూజాతికానీ, మతె
వ్వరె కానీ తన తోడివాని ననుకంపాదృష్టి వీక్షింపడేన్
గరువౌ దేశశుభోదయమ్మును జగత్కల్యాణ మో ప్రాణులా
ర! రహస్యం బిది జీవహింస హతశాస్త్రాల్ కోరునే యెచ్చటన్

౧౩

ఇల నేవాఁ డొకనాఁడు లేనియెడ నీవే లేవొ, యేవాని ని
శ్చల విస్ఫార భుజైకదండమున సస్యశ్యామయై భూమి బల్
పులకించున్, వశవర్తినుల్ తనకు నెప్డున్ ధాన్యపుంలక్ష్మి లా
లలితస్వాంతునిదే మహాకుల మదేలా కాదు యోజింపుఁడీ

౧౪

మతమున్ మంటను గల్పి తోడినరు సంభావించులే, సర్వస
మ్మతమౌ దివ్యమతం బటం చతని సూక్ష్మంబేని పీడింప, దు
ర్మతమం చీయవి పుణ్యపాపములుగా మాయాసుతుండన్న వా
క్య తతిన్ నిత్యము నక్షరాల జరుపంగా ముందు రారేలరో

౧౫

నన్నుఁ గొల్వకయున్న మానవుని బట్టి
చంపుఁ డని దేవుఁ డనెనె యే జనునితోడ?
నొక నరప్రాణిఁ గేవల మొక్క భిక్షుఁ
జంపఁగాఁ జేతు లెటులాడు జంతువట్లు?

౧౬

అతి ధైర్యంబుగ సాటి మానవులమధ్యం బట్టెఁడన్నంబు పొం
ది తినంగా నిరుకైన చీఁకటులవీథిన్ బుద్ధికాయాల గ్రు
డ్డితనం బొప్పఁగ వచ్చు దీనునికి ముష్టింబెట్టుటా? చంపుటా?
మత వైషమ్య మిటేల పిచ్చుకపయిన్ బ్రహ్మాస్త్రమై పాల్పెనో

౧౭

ఒక మహాతత్త్వమూర్తి కలరూపు తెలిసి
మతదోషము వివరింపకయ పోనె?
ఒకఁడు శాస్త్ర పరిశోధకుఁడు నభోంత ని
శ్శ్రేణికా గతుల నిర్మింపకున్నె?.
ఒక మహాకవి యెకాయికి అప్సరో జనం
బులను దోటీలతో దులుపకున్నె?
ఒక మహాదేశసేవకుఁడు స్వర్గాంగ సా
రణుల పంటలవంత లణఁప కున్నె?

కనఁగ నేపుట్ట నేపాము కలదొ వశమె
నిపుణు గప్పిన నిప్పతై భువి మతకల
హోర్మికా క్షుధా రుధిర మహోగ్రఘురము
పాణి యెండణో జనులు రూపణకయున్న

౧౮

నరజన్మంబది యుత్తమోత్తమమె యైనం దోడిప్రాణిన్ వధిం
తురె ఘోరాటవి సంచరించు నొకజంతుప్రక్రియన్? మర్త్యమూ
ర్తి రుషాభీషణ దుష్టబుద్ధి నవఖాళీమాతృగర్భాన, చి
చ్చె రగిల్చెన్ హతులైరి దిక్కును దివాచీలేని దీనప్రజల్

౧౯

ఆ దుర్మార్గదురంత సంహరణ దుర్వ్యాపార సంక్షోభవీ
చీ దుర్వార పటుజ్వల జ్వలన భస్మీభూతులం గాంచి, యో
యీ! దైవారదె లేశ మైన దయ, యే హీనాత్ముకేనిన్ దయా
ప్రాదుర్భావము చెందుకోశము స్వభావంబై తలం జూపదే?

౨౦

తన చేయాడునె యన్యమానవుని హత్యంజేసినట్లే, స్వకీ
యుని జంపన్ శరుకేని, కాన దయ సర్వోదంచితంబై యెసం
గును దాని న్మఱి తోడిమానిసి పయిం గూర్పంగ నీకేమి త
గ్గను దంష్ట్రీ! భువి పేరువాసి, మతసంక్షోభమ్ము నీకేలయో?

౨౧

భవబంధమ్ములఁ జిక్కి, కాలగతి నిల్వన్ లేదవాఁ డౌట, బి
ట్టు విలాపించుచుఁ గొద్దియౌ కొలతకూడున్ గుడ్డయుం దప్ప, న
న్య విధం బేమియులేని దీనుని గతుల్ నానాఁటికిన్ మారి, మా
రి విదుల్పుల్ వికృతంబుచేయ నిఁకఁ దంష్ట్రీ! ప్రాణముల్
తీయుదే?

౨౨

అతఁ డే పల్లియనుండి యాగతుఁడొ, భార్యాపుత్త్రుల న్వీడి,యె
క్కత మేతెంచిన వాఁడొ, పిల్ల లట సక్తస్వాంతులై రాత్రి యే
గతి నిద్రించిరొ మూర్త మొక్కయుగమై కన్పట్ట, సంసారవ
స్తు తతుల్ పుత్త్రవియోగ భారమును నీతోఁ జెల్లిపోయెం గదా!

౨౩

మతిలోఁ బొంగెదొ కాలసంపుటిని సమ్యగ్ఘుష్టమం చద్ది దు
ర్మతి! యా రెండవవైపు చూడుమదె తార్మారైన నీచేఁతలన్
సతియేడ్పుల్ సుఖమన్నదేయెఱుఁగు సత్సంతానముల్ నాన్ననా
కె తినందెచ్చునటంచుఁ బల్కు పలుకుల్, కీలారపుం గోడులున్

౨౪

అది జీవనమరణములుగ
గదికి విభాగముగ మధ్యగత కుడ్యమువం
టిది, అది లేనివి. మరణమ
యది యుండిన జీవనమ్మ యదియే ప్రేమౌ.

౨౫

ప్రేమకు మోసమయ్యె నిఁకఁ బ్రేయసి తా మరణంబు నొందిన
ట్లే, మహి జీవముల్ నిలచునేనియు, సోదర! వాని చావుతో
నీమెను గూడఁ జంపితివి హీనమతిన్, మదిఁ దోఁచలేదె నీ
సాము కదధ్వమై మతముసానికి జాతర యంచు మాత్రమే.

౨౬

అసలె వడగాడ్పు జీవన మాహరింప
నమల సామరస్యానపాయ ప్రభావ
సరళ గంభీర రస సరోవర కృపీట
మందు జాల్ రువ్వె నెవఁడొకో యలలురేఁప?

౨౭

జలరుహామోద భరిత కాసార వితతి
స్వామ్య భాగ్యప్రపత్తు లేర్పరచుకొనుచు
ముజ్జగాల తేజఃకీర్తి మూర్తులైన
నా ధురంధరగణ రాజహంస లెచట?

౨౮

ప్రత్యున్నతుని శిరస్సాగ్గి దరిఁజేరి
తన పుట్టుచోటునుద్ధతిని మఱచి
యొకవేళ నతఁడు మింటికిఁ జూచెనేని నా
తని మొదలంట మొత్తముగఁ ద్రోసి
తక్కువవాని సత్వరముగఁ జేరి త
ద్గంభీరతా సమత్వమునఁ దన్పి
తనధర్మములను యథాస్థితి నెఱవేర్చి
ఘనునుండి తాను జీవనము పొంది

యెన్ని రుచులో ప్రదేశంబు లెన్నొ తెలిసి
వింతఘోషల నొక్కచో విధముతోఁప
జీవయాత్రను జేయు నీ జీవనదిని
నెవఁడొ కొంత వేర్పరచి బంధించినాఁడు?

౨౯

ఒకనాఁ డీనదిలోని నీరువలె నన్యోన్యానుమోదంబుతో
నొకచో తెన్నునఁ బాఱినట్టి మన జాత్యుద్దేశముల్ భిన్నమై
యకటా వేఱుగఁ బాడుగుంటఁగల తోయంబట్లు వేర్వేఱులో
టకు నేఁడా పొనరించెనో మతముకట్టం బాఱునీరంబునన్

౩౦

పడియై నిల్చిన యీ జలంబునకు సంపర్కంబు లేకుంటచేఁ
గడు శోషిల్లఁగ దానఁ బుట్టినవి సూక్ష్మప్రాణులౌ డోమ, లేఁ
చెడు దుష్టాత్ముని దుష్టభావముల యుజ్జీం బట్టు బాధింపఁగాఁ
గడ కీనాఁడు రసార్ద్రతాగుణము శుష్కప్రాయమో? శూన్యమో?

౩౧

ఆసలె యింకిపోయిన దయారసము త్రవ్వ
వచ్చునో రాదొ కఠిక రాయచ్చు నేల-
చేతులారఁగఁ జేసిన చెనటివాని
భాగ్య మిదియంచు నేడ్తుము వలవలవల.

౩౨

పలుపలు విధాల మానవత్వ మనవేమొ
విశదముగఁ జేసి చెమ్మ చిప్పిలఁగఁజేసి
యేకలక్ష్యమ్ము తోడ సమీకరించి
మానవుని జాడఁ దెలుపుదు మానవునకు.

33

భావి భారత భాగ్యోద యావసరము
ప్రతినరుఁ డనుభవించి తీరంగ వలయు
సమతఁ గూడి యుచ్ఛ్వాస నిశ్వాసములను
సలుప వలయును దన సాటిజనుని గాంచి-

౩౪

అమలానంద విశిష్టమార్గములు సత్యాహింస లెల్లప్పుడున్
స్వమతంబై మమతాపహారి యగు జీవన్ముక్తుఁ డెవ్వాఁడొ, యా
యమలస్వాంతుని మార్గమందునఁ దనూమాత్రన్ జగజ్జేయమా
ర్గమునన్ జేయుఁడు మీరు, మెత్తఁదనముండాఁ జూపుడాబండయే

౩౫

నకనకలాడి పిల్లలు మనం బెరియం గుఱువెట్టి మై నెఱుం
గక పడిపోయినా రొకట, కందువు పాలకు పట్టితోళ్ళ నూ
రక బలుచప్పరించి తల ప్రాణము తోకను నిల్పియుండెఁ, ద
ల్లికి నిన్న వున్న ధోరణియు లేదు- కనుంగొనుఁ డయ్యదుర్గతుల్

౩౬

ఇల్లున్ వాకిలి మంటలోఁ గలియ మధ్యేమార్గులై, మూటయున్
ముల్లెన్, జేతనుబట్టి యీడ్చుకొనుచుం బోలేక, సంసారపుం
వాల్లభ్యం బెరియింప నెందులకు నిల్వ న్నీడయే లేక, యి
ట్లల్లాడంగను నేరు కారకులో యబ్బా! దీని యోజింపరే!

౩౭

ఆర్తత్రాణధురీణ! రాఘవ! మనుష్యప్రాయునిన్ దేవతా
మూర్తిం జేయఁగఁజాలు నీ మతమె తన్మూర్తిం గిరాతక్రియన్
వర్తింపంగను జేయుచెట్టులో, మతవ్యాజాన జ్వాలావళిన్
నర్తింపంగను జేయుచె ట్లొక గృహానన్ వేళాకం డిచ్ఛతో

౩౮

అరయుండీయవి మీరు భ్రాతృజనులారా! న్యాయమార్గం బట్టి, యీ
తరుణీలోకము స్వేచ్ఛగాఁ దిరుగుతన్; దా రింక నీ సోదరీ
వరసీమంతినులన్ దయాస్వభావమునఁ గావ న్నేర్చి, కల్యాణసు
స్థిర సౌభాగ్యములంది గడించుఁడు మహాశ్రీ వర్ధతామం చనెన్

౩౯

దోః కమలంబు విప్పి దయతో శివరించె హృదబ్జసుస్థితాం
భః కణ దోషశూన్యగతి బంధురభావముతోడ, నిర్మలాం
తః కరణ ప్రవృత్తులకుఁ దాశముగాఁ గరసజ్జ చేయు చం
హః కరి సింహపోత సదృశాత్మకుఁ డా యతిసత్తముం డటుల్

# పరివర్తనము

౧

అప్రతిహత మయూఖ తీవ్రప్రతాప
మూర్తి విశ్వసంక్షోభమ్ము మూలమునఁ బ్ర
శాంతముగ లోకమేల నస్తనగ పీఠిఁ
జేర మేనికాంతులు సంధ్యగా రహించె-

౨

ఆ ప్రశాంతారుణ కిరణశ్రీ ప్రసార
జలధి సుస్వేచ్ఛగఁ దలమున్కలు ఘటింతు
రాయు రారోగ్య శాంతులకై, మనుజులు
యతులు క్రీడా విహార యోగాదికలన-

3

అట్టిచో బోధనల మొదల్ వెట్టనను మ
తంబు చూపె నాఁ బ్రకృతి సంధడులుచేయ
నా యతివతంసుఁ డంత నాయత్తమై, య
మృత సమ పవిత్ర వాక్య సంతృప్తిచేయు-

౪

నాఁటికి నాఁటికిన్ జనమనంబుల నా యుపదేశపద్ధతిన్
నాటుకపోయె శాంతి సుగుణమ్ములు, స్నేహలతా ప్రరోహముల్
గాటముగా మతంబుకయి కత్తిని బట్టుట మానినార లా
వీట మహమ్మదీయులు నివేశములం జొరి రెల్ల హిందువుల్!

౫

పనిపాట్లం బగలందె చేసికొని శశ్వద్భక్తిదీవ్యత్ప్రబు
ద్ధు నుపన్యాసము వించు మూగెదరు ముత్తోపిండు లీవంక, త
క్కిన హిందూప్రజలుం దురుష్కజను లేకీభావబుద్ధిం దమం
తనయావంకను గూరుచుందురు మహోత్సాహంబుదీపింపఁగన్

౬

క్రోధముచేతనో యనఁగ రూక్షణ వీక్షణ పంక్తితోడ నం
గీ ధరిమించి సంగర చికీర్షువులన్ భయపెట్టురీతి లుం
గీ ధరియించి శ్మశ్రువు వికీర్ణముగాఁ గొనగోట దువ్వుచున్
సాధు వచోఽమృతమ్ముఁ గొనఁ జయ్యన వచ్చుఁ దురుష్కుఁ
డొండటన్

౭

వచ్చినవాఁడు తన్మహిత వాక్ప్రవణానసె కాలమంత సుం
ఖుచ్చినచో నదెంతటి ప్రమోదముఁగూర్చెడి, నట్లుగాక, తా
నచ్చపలాక్షి వైపు కనులార్పక చూచు, నెదో గొణంగు, బల్
వెచ్చని యూర్పు లెంతొవదలుఁ జనమధ్యమునుండి ఛీకృతిన్

౮

తా నానాఁడు వనంబు వెల్వడి మహాతాపంబుతోడం దురు
ష్కానీకంబును యోగి సన్నిధిని దుష్టాలాపముల్ చేసె, న
ద్దానం దన్నుతఁ డంతనుండియు భయోత్పాతంబుగాఁ జూచుటన్
స్త్రైణంబందున నుండి యామె తలఁచెం దత్రత్య బీభత్సమున్

౯

స్వపతిం బాసిన బాధపైఁ బరునిసంజ్ఞల్ మ్రగ్గుచున్నట్టి న
క్రపయిన్ రాలిన తాటికాయగతి కాఁగా, గుండె నీరై యతి
వ్యపదిష్ట శ్రుతివాక్య భావభవ బాష్పప్రక్రియం గాఱ, నా
థుపయిన్ డెందమునిల్పి మాయతివ తోడ్తో వీడిపోయెన్ సభన్

౧౦

చెమటల్ గాఱు నిదాఘవేళ నయినం జేదోడువాదోడు గా
సమతం గష్టముచేసి సార్థకముగా, సాషేను శబ్దంబు, కా
లము సంతుష్టి సమష్టిగాఁ గడపునాళ్ళన్ జ్ఞప్తికిందెచ్చి, లోఁ
గుమిలెన్ భామిని, యశ్రువుల్ తొణఁగుపొంగుల్ వాఱ నారాతిరిన్

౧౧

తన సర్వస్వము, జీవితాబ్ధితరణిన్, స్త్రైణ ప్రభాలంబ య
ష్టిని స్వీయాత్మ గృహాంత దీపకలికన్, శ్రీ కుంకుమద్రవ్య మం
డన మాంగల్యశుభంకరున్ తన లలాట స్వర్ణవర్ణాంశు, యౌ
వన సామ్రాజ్యపుఁ బట్టభద్రుఁగను దైవం బెప్పుడో యంచుఁదా,

౧౨

అలనాఁ డా యతిసత్తముం డట మదీయాలాప మాలించి, యు
త్యలఘుస్వాంతముతోడ నవ్వుచు నభీష్టావాప్తి రస్తంచు, నె
చ్చెలులెల్లం గనుగొంచు నుండ వచియించెన్ నాఁటికిన్ నేఁటికిం
దలఁతున్ నాథునికై యవాంతర విపద్వ్యాపార మేపాటిదో ?

౧౩

నాథా నన్నెడఁబాసి నీ వెచట నున్నావయ్య, యిల్లాలి యీ
బాధం దీర్పఁగ రాగదయ్య, కలుషస్వాంతుం డెకం డేలయో
క్రోధుండై నను జూచి యేలొకొ గొణంగున్ సంజ్ఞచేయున్, మద
వ్యాధిగ్రస్తుఁడు వాఁడు వచ్చితిని దూరాలోచనల్ చేయకే-

౧౪

అని చింతించుచు నాఁడుచూతమనిసంధ్యాకాల మేతెంచుడున్
వనితారత్నము తోడియౌవతముతోఁ బారాశరి ప్రార్థనా
త్త నివేశంబును గూర్చి యేగఁ గని, మత్తత్వంబు చిత్తంబు నే
చునె మున్వచ్చినవారురారు సభకంచుంబల్కై యోగీశుఁడున్

౧౫

పరిషత్తుం గని యన్నపల్కు తనకున్ వర్తింపఁగాఁ దన్వి స
త్వర మేతెంచి యపారభక్తి యతిపాదద్వంద్వమున్ దాఁకి, ము
ష్కర తాత్పర్యముచెప్పి మ్రొక్కఁగ వియోగక్లేశమున్ వీడు మం
బరొ యంచున్వచియించెవాఁడుభవితవ్యంబంతయుందోఁపఁగా

౧౬

రేఁగు రిరంసతో యతివరేణ్యుని సన్నిధి నిల్చెఁ గైతవ
శ్రీగ మహమ్మదీయుఁ డరరే పసిపిల్లఁడు పోయె దేవరా
మాగతి యేమియంచు స్మయమాన ముఖాబ్జుఁడతండు,వచ్చి రే
పే గృహసీమ కేగుఁ డనియెన్ జనులాడఁగ మోదమానుఁడై

౧౭

ఆ నవాంబుదదేహి దివ్యాననోద్ధ
తం బగు వచోమృత కణాళి తవిలి మోసు
లెత్తెఁ గ్రొంగ్రొత్త కోర్కెలా యిగురుఁబోడి
మదిని గంతస్వరం బను నదును కలిమి-

౧౮

అట కేతెంచిరి నాఁటిహిందువులు భార్యాభర్త లానంద వి
స్ఫుట వాక్యామృత ధారలన్ యతివరుం బూజింపఁగాఁ,గాళ్లఁజెం
గటకున్, భ్రాతృ మహమ్మదీయుఁడొకఁడా కళ్యాణి కందించెఁదా
నటకాయించి హరించినట్టి శిశువున్ హార్ద ప్రపూర్ణాత్ముఁడై.

# పరిణామము

౧

దేశదేశాంత రాజ్యవిస్తృతి గడింప
జర్మనీవారు వివిధశాస్త్రములఁ దరిచి
మారణాస్త్రాళి ఘోరాతిఘోర మృధము
చేసి యెన్ని రాజ్యములనొ చేకొని రట-

౨

ఎన్ని దేశంబులో వాని కెరయయి ప్రజ
జీవములఁ బాసె పృథ్వీబుభుజీషమందు
మర ఫిరంగుల మంటలమాడి, కడకుఁ
బడియె వాఁడు రష్యావారి బారిఁదగిలి-

3

పరమ దేశభక్తుండు సుబాసు బాబు
మాయమై పోయి ఢిల్లీకి మరలినడచె
నప్రతిహత జాతీయ సైన్యంబుతోడ
నాటితేటిన వీర ముఖ్యతతితోడ-

౪

వడకి విశ్వమంతయును దల్లడిలి పోయె
భద్రతాసంఘ మొకటి యేర్పడియె దాన
శాంతి విశ్రాంతి యనుచుఁ బ్రజాప్రభుత్వ
మఱచె విశ్వమంతట శాంతియ కఱవనుచు-

౫

తాడిఁ దన్నువాని తలఁ దన్నువాఁ డుండు
పారతంత్ర్య మోచ నారభటుఁడు
గాంధి కాఁగలట్టి గతులెంచి భాగ మం
గీకరించె జన హితైకబుద్ధి-

౬

అట్టి సమయాన నేమి చేయఁగను లేక
నట్టు చెప్పక బ్రహ్మార్పణముగ నేండ్లు
రెండువేల కేఁబదియు మూఁడుండఁ గౌరవ
వదలి యాగస్టు పదునైదవ నిశియందు-

౭

ఉత్తరాన మహమ్మదీ యోత్కరంబు
దక్షిణాన హైందవులు, తత్తద్బలాల
సంఖ్యలను బట్టి చేసిరి- స్వల్పసంఖ్య
లున్న నేమైన నెచటఁ బోష్యు లనుకొనిరి-

౮

అట్టి మహదవకాశంబు నందు నుత్స
వాలఁ జేసి రాబాలగోపాల మలరఁ
బిండివంటల చూత్కార విలసనముల:
జనులుపాడిరి జయజయధ్వనుల నిట్లు—

౯

ఒకనాఁ డెట్టిదురంతకృత్యముల నన్యుల్ రక్షించి కావింప, మా
నక డెందా లెదురొడ్డి గుప్పిటను బ్రాణాల్ వట్టి పోరాడిరో
సకలంబుం ద్యజియించి సోదరులు, తత్సత్యాగ్రహాభీష్ట దా
యక రూపంబ! త్రివర్ణ భారతపతాకా! నీకు జోహారువుల్.

౧౦

నలువది కోట్ల భారతజనం బరలే పెఱవారి పెత్తనం
బులఁ బడి చిక్కి మత్తుగొని, మూసెను గన్నుల నాఁటినుండి నీ
వెలుఁగులు బాహ్యనిద్రఁ బరువెత్తఁగఁ గొట్టి స్వతంత్రతాపి ని
స్తుల విభవంబు లీనెడిని సూత్రితజాతిపతాక! నేఁటికిన్

౧౧

ఒకఁడా యిద్దఱ చచ్చి పుట్టి పరదాస్యోన్మోచనార్థంబు, వా
రక కాలంబు గృహాయమానముగఁ గారం బుచ్చి పోరాడి, ఘా
తుక కృత్యంబుల నెల్లెడం బరమసంతోషంబునన్ సైచి, నేఁ
టికి నీజాతికి సుస్వతంత్రతఁ బ్రతిష్ఠింపంగఁ బుణ్యాత్మకుల్.

౧౨

అమితానందముఁ గూర్చు జాతిముఖ తిర్యక్పుంద్రమై యేకతా
విమలజ్ఞానము శాంత్యహింసల నిరూపింపంగ, శక్తిత్రయ
స్వమతంబై, పరివేషసంకలితమై, బాలార్కు రూపించి, క
ష్టములంబాపి, సుఖంబు గూర్చెడిని జెండా, రండు పూజింపఁగా.

౧౩

ఎన్నియేఁడులో పరదాస్య శృంఖలఁ బడి
నేఁడు గట్టుచేరితి మబ్బ, మూఁడువంద
లేఁడులకు, నిది మనతాత లెఱుఁగనట్టి
సుప్రభావ స్వతంత్ర తాత్త్ర ప్రతిష్ఠ

౧౪

ఈదృ శానన్యసాధ్య మహిష్ఠ భరత
మాతృభూమి స్వతంత్రతా హేతుభూత
శాంత్యహింసాది సతత సంస్తవ్య సుగుణ
మూర్తిమత్కీర్తి ! పూజ్యబాపూజి గాంధి.

౧౫

త్యక్త సర్వస్వ విమల మేధాప్రపూర్ణ
తా గభీరతాత్త జనతాధ్వ ప్రదర్శ
కుండు, రాజకీయజ్ఞాన మండితుండు
పండితుం డగు నెహ్రూ ఒకండు ఘనుఁడు.

౧౬

తుష్టజాతీయపృతనా వధూధవుండు
సర్వ భీకరవిప్లవ ధూర్వహుండు
భరత మాతృగర్భ శ్రీతపఃఫలమ్ము
స ర్గధాముఁడు శ్రీ సుభాశ్చంద్రబోసు.

౧౭

కీలు కీలుకుఁగల రాజకీయ బంధ
వె నుఁడు, యుగంధరమంత్రి, ముక్తకోపుఁ
డలమేధావి, ఆర్యసత్తముఁడు, కీడు
మే లెఱిఁగి యెత్తువేయు పటే లొకండు.

౧౮

శాంతికరగించి పోసిన సత్త్వమూర్తి
పుణ్యఫల మైనవాఁడు గఫూరఖాను
తెలతు రీతని నపరగాంధీ యటంచు
త్రికరణాత్మక శుద్ధిబుద్ధి గలవాఁడు-

౧౯

భరతజాతికి భ్రాతృభావమె యశః ప్ర
సాధనం బని తెల్పు నజాదొకండు-
న్యాయమూర్తి ప్రపంచ విన్యస్తకీర్తి
స్వర్గగుఁడు మహాదేవ దేశాయి యొకఁడు.

౨౦

యతియై, యోగివరేణ్యుఁడై విమల సన్న్యాసివ్రజ శ్రేష్ఠుఁడై
మతిమంతుండయి, మౌనియై సకల దుర్మార్గమ్ములం జెండు భా
రత దేశాభ్యుదయైకజన్ముని ప్రచారాత్ దేని సాధింప, వా
మత సర్వస్వుని గాంధిదేవుని మహాత్మప్రాభవుం గొల్చెదన్-

ఇతి శమ్

# అంకితము

## చిరంజీవులు మండాది జయలక్ష్మి కృష్ణమూర్తులకు

౧

ఎక్కడి చదువో యేమొ ! యొకయింత వివేకముమాలి, కొండకొ
మ్మెక్కి, తమంత, కట్నమదియింతని బేరములాడుచున్, యువల్
చక్కటి తప్పునాళ్ల, వికసన్నవ కోమలవల్లి యల్లుకై
నిక్కపు బాధ చెందు గృహినిం దనియించిన కృష్ణమూర్తికిన్

౨

తల్లిదండ్రుల వత్సలత్వమ్ము, మమత,
పనులఁ జేయింపఁ జాలని పసితనమ్ము-
భర్తృసేవలో నలయు సౌభాగ్య గరిమ
నంద, వెలుఁగొందు, జయలక్ష్మి, యనుఁగుసుతకు

3

అంకితముగాఁగ నిడుదుఁగావ్య మణి దీనిఁ
బ్రథిత మండాది వంశదంపతుల కెలిమి-

కృతిభర్త- చిరంజీవి మండాది కృష్ణమూర్తి., యం. ఎ.,
గణితోపన్యాసకుఁడు, జవహరుభారతి, కావలి.

# స్వప్నము

౧

ఓ జయచంద్ర ధారణివిభూ! విభవోజ్జ్వల రాజసంతతి
శ్రీ జలజాతహేళి యురరీకృత ధిత్సు మహమ్మదీయ గో
రీ జయశాసనా! ప్రభువరేణ్య శిరోమణి పృథ్వీరాజ తే
జో జయశీలి! వర్ధిలు వసుంధర దోషవిదూరచిత్తతన్.

౨

నా సామీ! గతరాత్రి వేకువను స్వప్నం బొండు తోతెంచె, గో
రీ సేనల్ మనసాయముం గొని ప్రభుశ్రీ పృథ్వీ రాజున్ మహా
యాసం బొప్పఁగఁ బట్టి శృంఖలల వేయంజాలి రామీఁద నా
రా సింగంబు తురుష్కమధ్యమున గర్జా భీకరాకారమై

3

తన శితదృష్టి ముష్కరవితానము చీమలుదోమలై, నిబం
ధనములు మత్తవారణమునం దగిలించిన నూలుత్రాడులై
తనరఁగ శ్మశ్రువున్ మెలిచి తాప విఘూర్ణితగాత్రుఁ డౌచుఁ గాం
చన నిభదేహమున్ జననిసన్నిధి కానుకగాఁ దలంచుచున్

౪

ఓరీ గోరి! మదీయరాజ్యమున శ్రీయున్ సౌఖ్యముం గోరి, ము
ష్టేరాజిం బడిపాఱిపోతివి, తురుష్కుల్ నేలమట్టంబుగా
నా రౌద్రోత్కట రాజపుత్రగణ బాహాశక్తితీక్ష్ణాగ్ని, పృ
థ్వీరాజా నిల వర్ధితంబయి మిమున్ వేయించె భూఖల్లికన్-

౫

తుదిదాఁకన్ సమరంబు చేయకయ హిందూరాజ్యపీఠంబు, ద
క్షదురా మా రసపుత్రు బొంది నశువు ల్కల్గంగ, స్థానేశ్వరుం
డు దయాదృష్టిని జూచునాళ్ళఁ బసివాఁడు న్నీకు లొంగండు దో
హదమై హైందవుఁ డొందు గాని తరుణం బందో తురుష్కబ్రువా!

౬

అరె జయచంద్ర! యెంతటి మహాఘము నీవొడిగట్టి నావురా
షరువు ప్రతిష్ఠ వీడి మనభాగ్యము గంగనుగల్పినాఁడ వె
వ్వరి తలకెత్త నెంచితివొ వ్యాయతభారతరాజ్యభూతి నెం
చర, యది జన్మభూమి కపచారముకాదుర జాతిపేరిటన్

౭

ఇది నాకైన పరాజయం బనుచు నూహింపంగఁ బోకోయి యి
య్యది నీజాతికి నీకు నబ్బిన ఫలంబౌ, నేఁటి నాక్రాంత త
ప్పదు రేపైనను నీకు, నప్పుడు వృథా బాధం బడంబోదు వ
య్యదియే కాదుర దుర్యశం బలము నీ కాచంద్రతారార్కమున్

౮

మనలో దోషము లెన్నియుండినను సన్మానింపఁగా నౌనె య
న్యుని నష్టాను తురుష్కసైన్యముల నయ్యో మాతృభూమీగళం
బున నున్నట్టి పవిత్రసూత్రమును నిర్మూలమ్ము గావించి తీ
తనువుం బొందఁగఁ ద్రోవ యియ్యదియె, కర్తవ్యమ్ము పోనాడితే

౯

నీ నా తప్పు లివేలయెంచఁగను బోనీ, మేలుకొ మ్మింతటం
గానీ హైందవజాతి కైక్యమతి శూన్యం బద్ది పూరించి, జెం
డా నిల్పన్ సమకట్టుమోయి! యిఁక నీ డాలున్ డవాలున్‌వృథా
కానీకోయి కుళాయిపిచ్చిదొర నా కాయమ్మె బంధించెగా-

౧౦

తన భరతాంబకై యొడలుదాఁచని యీ రసపుత్ర, వీరచౌ
హన కుల పావనుండు పరహస్తముఁ గల్పునె యెన్నడైన, నా
త్మను హననంబు సేఁత జనమాన్యుఁడు కోరునె, కారణాంతరం
బున క్షతగాత్రుఁ డైనను సమున్నతి తాఁ బెదకాల రాచునే!

౧౧

ఈ తనుశక్తియున్ వృథగ నిట్టుల నుండ దటంచు బందపుం
జేతుల లాగి త్రెంపఁగ వశీకృతుఁజేసి తురుష్కవీరు లా
రీతిని జూచు గోరిదొర శ్రీముఖముం గొని వానికంటిగ్రు
డ్లాతతదుష్టబుద్ధి వెలయం బెరికించిరి చంద్రభూపతీ!

౧౨

ఆ మూర్తిం బ్రభవించినట్టి పులకాహంకార రూపప్రభల్
ప్రామెన్ దుర్భరశాతభల్లముల తీవ్రస్ఫూర్తి గోరీదొరన్
జీమ ల్పెట్టినపట్టలైన జనతాసీమల్ తురుష్కప్రజా
సామాన్యావసథంబు లయ్యె నపు డీషత్కాలవైరుధ్యమై

౧౩

ఆ గంభీరసముద్రు నేత్రములు తీవ్రావేదనందోఁగ వా
ర్తా గుంజల్లహరుల్ నలుంగడలఁ దత్ప్రాంతమ్ములం జేరె నే
దో గర్భంబునఁ దాల్చి తత్ప్రకృతి సద్యోరాగముం గ్రక్కె నే
వో గానంబులుసాగి లేచితిని తావుల్ దప్పి, సత్యంబెదో

౧౪

అని తనస్వప్నగాథను సభాంతరమందు వచించె వృద్ధచా
రణుఁ డొకరుండు దుఃఖజలరాశి మునింగిరి తత్సభాసదుల్
కనులకుఁ గట్టినట్టిగతిగాఁ దనబుద్ధికిఁదోఁప, నాత్మవం
చనఁ దలవంచినాఁడు జయచంద్రుఁడు కార్యనిబద్ధబుద్ధియై

ఫలము

౧

అవి గోరీజయభేరి భాంకరణముల్ వ్యాపించె నందందు, సై
న్య వితానంబుల యట్టహాసములు జిందాబాద్ నినాదాలు, హైం
దవసేనావితతుల్ యథాయథలుగా ధైర్యచ్యుతిం బొఱుచుం
డె, విశేషాలెవొ! ఉద్ధమోసమయి కట్టెన్ వారి యాఘంతయుఁన్

౨

కలయో యా నటరాజనృత్యకళయో గంధర్వకోలాహలం
బులొ కాన్పించెడిదృశ్యముల్ దలంప సమ్మోదాబ్ధి నోలాడువా
రలు, దుఃఖాబ్ధిమునుంగు వీరవరులౌరా, యుద్ధపుందేవి మ
చ్చులివే, కొందఱినేడిపించు నగియించుం గొందఱిం బ్రీతితో

3

అది క్రౌర్యావధి మృత్యుదేవతకు నుద్యానంబు, దేహాలు, చి
వ్వ దితమ్మైన ప్రచండవీరులకు స్వర్ద్వారంబు, చారిత్రకా
స్పదమై పెట్టనికోటగోడయ, యసంస్కార శ్మశానంబు నౌ
గద! సంగ్రామతలంబు,లోకులకునుత్కంఠ న్నిరూపించు మన్

౪

ఆ భూదేవత బర్వుదించెడితలంబై, కాల నున్వీరు వా
ర్తా భేదంబులు వ్రాయులేఖినికి విశ్రామస్థలంబై జయ
శ్రీ భామాపజయేందిరా సతుల మాతృస్థానమై, కాల్పిక
ప్రాభాతంబయి యొప్పు సంగరభువీ! భావింతు నీచర్యలన్

౫

తమ సౌమ్మోదియొ పోయినట్లుగ సమిద్వ్యాపార మేపార దే
హము నర్పింతురు పెక్కు మానవులకేమార్థంబు, కాయంబని
త్య మటంచుం దృణమట్లు చూతురు కళత్రాలన్ విసర్జింత్రుసౌ
ఖ్యములన్, కింబహునా? మహాత్ములన వీరాగ్రేసరుల్ గారొకో

౬

రోగముతోడ దేహమది రూపఱఁ జచ్చుటకంటె, వృద్ధుఁడై
యే గతిలేక మృత్యువు పయింబడ నిల్గుటకంటె, కాల మి
ట్లేగడపందలంచియపమృత్యువుచేఁ బడుకంటెఁ బ్రాణముల్
త్యాగముచేసి కీర్తిరమ నందుట యెంతటిపుణ్యమో కదా!

౭

రౌద్రేభేంద్ర విదారణశ్రమజ నిద్రాబద్ధ విద్రాణ సిం
హోద్రేకైక విలంఘ నోచ్ఛ్వసిత సద్యోగర్జలం జేయుచున్
క్షుద్రప్రాణులవైపు చూడనయినం జూడంగఁ బోనట్లుగా
రౌద్రాకారతఁ బృథ్వీరాజు సనె నుగ్రంపశ్యుఁడై, బందియై

౮

తన సేవాపరతంత్రులై తురకవస్త్రాదుల్ భజింపంగ, బం
తిని సేనాధిపతుల్ రహింపఁగను బందీభూతుఁడై పృథ్వీరా
జ నృపాలుం డటుకూరుచుండ నిజవేషస్ఫూర్తి, గోరీ సుభా
సనుఁ డయ్యేన్ జయచంద్రుఁ డాసభకు శ్వద్రీతి నేతెంచెఁదా

౯

వచ్చినవాని కా సభ నివాళియొసంగఁ గరంబుగోరియుం
బొచ్చెములేని ప్రీతి వెలిఁబుచ్చఁగఁ దా నుపవిష్టుఁడై, కనుల్
విచ్చి సభాంతరస్థ పృథివీసతి దుఃస్థితిఁ గాంచి యెద్దియో
పిచ్చిగ మోమువంచెఁ బెదవిం గదలింపఁగ నేమితోఁచెనో

౧౦

కుతుబుద్దీను తురుష్క భూపతిని జక్షుస్సంజ్ఞతోఁ జూచెఁ ద
త్ప్రతిసంజ్ఞన్ ఘటియించెగోరి యిఁకఁ గర్జం బెద్దియో, పృథ్వీభూ
పతి యాదృశ్యముఁ గాంచి భీకరవచః ప్రాగల్భ్య మొప్పార వం
చితుఁడౌటన్ జయచంద్రుఁగాంచియనియెన్ జేతంబుతప్తంబుగా

౧౧

ఇది మోసంబనిరెంచుమింతటయినన్‌హిందూ ప్రభుత్వమ్ముబూ
డిదపా ల్సేయఁగ వీఁడు పూనె, నొనగూడెన్ నీదుసాయాన నా
యది, నీ వొక్కఁడవైతి, నాగతియ నీకౌ మీఁదికార్యంబు త
ప్పదు సుమ్మీ జయచంద్రసోదర యిఁకం బ్రాణాలు కాపాడుకో

౧౨

ఇతఁ డీజాతికిఁ గొంత నీతికఱచెన్ హేమాక్షరాలన్ లిఖిం
చుత మీవార్త చరిత్రకారుఁడు యశస్సున్ నిల్పుకోవోయి, పం
చతకున్ స్వాగత మిత్తు, వ్యక్తిగతదోషాల్ రాజ్యతంత్రాలతో
జతగాఁ జూతువె, పిట్టపోరులను మార్గాలమ్ము తీర్చెం జుమీ

౧3

ప్రతిపద మంతమై నరనరంబుల కంటఁగ శోకతప్త చి
త్తత జయచంద్రుఁ డెట్లొ బలుతాలిమి దృష్టి నిగుడ్చె గోరిపైఁ
బ్రతిపద మంతమై నరనరంబులకంటఁగఁ గోపతప్తచి
త్తత వెలిఁబుచ్చి గోరి భయదర్ప నిరూపితగాత్రుఁడై త్వరన్

౧౪

ఆరె నైయెబక్కు రహస్య మోరి యిటురా ఆతం డదేమేమొ ప
ల్కెర, అప్రేలుడుగాఁడు రెచ్చఁగొలుపం గ్లేశమ్ము వాటిల్లుఁ గీ
లెఱుగం డీఁతడు, సేన డస్సినది, వీఁడేతేరెనా సేనతోఁ
బరువుం బోవు నిఁకెన్నఁ కన్ గెలువ నోపంబోమురా భారతిన్

౧౫

కావున వానికన్నులను గాదనకే పెరికించివేయు మీ
భూవరు సన్నిధిన్ శుకమవున్ జను మంచు వచించి యోయిభూ
మీవర తీరెనేకసి, నిమేషముచూడుమ యాపులించినం
బ్రేవులు లెక్క పెట్టెదుసుమీ' నిను మూఢునిజేసె వీఁడనెన్

౧౬

తాను వినినట్టి చారణోక్త విధ మపుడు
సర్వముం గాంచి యా జయచంద్రుఁ డంత
నదరిపడి లేచిపోయెఁ జౌహనకులైక
ప్రభుని రీతిని నెంచి సంరంభి యగుచు

కమ్మ ౧

మాపైఁ గ్రోధముపూని యిట్టుల మహమ్మద్గోరి రావించి, ఢి
ల్లీ పీఠంబున నిల్పి యెంచితివొ పాలింపం గనూజిన్ మహా
భూపానన్యుఁడవై, తురుష్కపతి చంపుం బక్కలో బల్లెమై
ఏ పాపంబు ఫలించె, దుర్యశ మిదే నిండెన్ జగత్తంతయున్

౨

శూరాగ్రేసరులంచు క్షత్రియులటంచున్ ధర్మయుద్ధంబునం
బేరుంగాంచిన వారటంచు, రణభూమి న్గూలి యామీఁదటన్
వీరస్వర్గము కాంతురంచును ధనుర్విద్యాధురీణాత్ములం
చీ రాజన్యులు మించియున్ సహనభా వైక్యమ్ములం బొందిరే?

3

జితకాశిప్రథముండు విస్తృతకనూజి ప్రాభవోద్భాసి, శ్రీ
యుతగోవిందుఁడు నీదుతాతయయి, వంశోద్ధారకుండై, యశో
వ్రతతీ నిస్తులితావలంబమయి పోవన్ వానియూర్పేరు లే
గతియౌనో యన నీతరంబుననె కక్కా! తేలిపోయెం గదా

౪

బయలైపోయెను గాఁపురం బిటు భవత్పాపిష్ఠకర్మాన, నీ
పయినన్ నిల్చిన నింద కింతటయినన్ వానిన్ మృధంజీల్చి దో
ర్జయముం గాంచుటొ వానిచేతఁబడి వీరస్వర్గముం గాంచుటో
కయికో బాణము రాచబాటయది, సంఘస్తుత్య కార్యంబదే!

౫

చనె విధ్యుక్త వధూస్వయంవర మహాసంరంభ మానాఁడు నే
నును నాకోరిన దివ్యసుందరుని గన్గోకున్కి నుత్కంఠతో
డను దద్విగ్రహమందు దండనిడితిన్, డబ్బాటుగా సామి వ
చ్చెను, నా పుణ్యఫలంబు చేరితిని గించిత్తిందుఁ దప్పున్నదే!

౬

అరియేయాతఁడు ఢిల్లిరాజ్యమును జేయంజాలుటన్, దాని నె
వ్వరు కాదందురు? వైరమెంతునటె, శశ్వన్మూర్తి, యజ్మీరురా
జ్య రమాశోభితుఁ డొంటనింట నిటు భోగ్యశ్రీలు చేకూరఁగా
మఱి యన్యు న్వరియింతునే జనక ! యుష్మ ద్వంశసంజాతనై

౭

ఇవి రెండే తలపోసితిన్ జనక! నా యీ పృథ్వీరాణ్ణామ భూ
ధవ ప్రాణౌకృతి నీకు నచ్చిన ననంతప్రీతి జామాతృవై
భవ నిస్తుల్యత నెంచి మించెదవు, ద్విడ్భావంబు తోతెంచెనేన్
దివి కేగన్ వెనుదీయ యుద్ధమునఁ గత్తింబట్టి మన్నాథుతో

౮

అది నాధర్మము, నామనోహరుని బాహాశక్తికిన్, నాదు శ
క్తి దలిర్పన్ సమరంబు చేయుటయు, పృథ్వీరాజచంద్రుండు,పో
రి దివింజేరిన నేనుబోయెదను గీర్తింగాంచి, గెల్పొందెనే
ని దిశాచక్రము నేలుకొందుఁ బ్రణయోన్మేషంబు రూపించుచున్

౯

అవలేశ్రమఁ బోరిలోగెలిచి, ఢిల్లీపట్టణంబున్ రమా
భవనం బౌనటు తీర్చిదిద్దిన మహీపాలుం డయః స్తంభమున్
సువిశేషంబుగ సప్తవింశతిగుడుల్, సుస్నిగ్ధచిత్రాలతో
డ వెలారించె ననంగపాలుఁడు నిజేష్టస్ఫూర్తి దీపింపఁగా

౧౦

అటు లా తోమరవంశకంధి తతశీతాంశుండు, ఢిల్లీపురీ
ఘటనాపాత్రుఁడపుత్త్రకుండు, చనభూకాంతుండు, మన్నాథుఁడం
తట మాతామహరాజ్యముం గొనెనుగాదా, నీవు కాంక్షించుచోఁ
గట యుద్ధంబును జేసి పొందుటయె నీకర్తవ్య మౌ గాదటే!

౧౧

అనిఁ జందేల్పరమాలునామక మహాబాధీశు నోడించి, కీ
ర్తిని గైకొన్న సమిద్విహారి కదనోర్వీన్ గోరిసైన్యంబు తు
త్తునియల్గాఁగఁ దురుష్క రాజకరముం దున్నంబుగాఁజేసి, గె
ల్చిన దోర్వీర్యుఁడు పృథ్వీరాజు పరిపాలింపంగఁ గాఁడే భువిన్

౧౨

ఇది భేదంబని చెప్ప నోచుకొనలేదే, సామదానాల నీ
మదిలో నెంచితె తండ్రి! సామమున సన్మానించి మాటాడితే
యది యట్లుండఁగనిమ్ము, నాఁడయినఁ గన్యాదానపూర్వంబుగా
నిదమిత్థమ్మని చెప్పినం బనులుకావే! నేను సంధింపనే!

౧3

ఇది భేదంబనియైనఁ జెప్పుటకులేదే! యీ యుపాయాలతోఁ
బదవీలాభము చేకురన్వలయు నప్పా! భేదముంగూర్చి, యె
య్యది సాధించుటొ నాదునాథునొ? తదీయశ్రీనొ, నీవిప్డు త
ప్పిదముం జేసితి, నీ కనూజి కెసరుం బెట్టించితౌ దీనిచే-

౧౪

అలనాఁ డీసులతానుగోరి తన రాజ్యశ్రీ సురాష్ట్రంబులో
పల సుస్థాపితముం బొనర్ప ననిహిల్వార్ రాజుపై కేగ, ను
జ్జ్వలచారిత్రుఁ డతండు గోరిని మహాసంగ్రామమం దార్చి, తు
రుష్కులు రేఁగం బడఁగొట్టిపంపఁడె తురుష్కుల్ పేరెముల్దీయఁగన్

౧౫

అది గోరీకిఁ బరాజయంబనుట యప్పా చాలనేచాల, ద
య్యది తత్సైన్యపరాజయంబనుట పూర్త్యర్థంబు కానేర, ద
య్యది దుష్టాక్రమణక్రియాపజయ సవ్యార్థంబుగా, వ్యక్తమై
నది యారాజపతంసు కార్యమున, జాత్యంభోధి యుప్పొంగఁగా

౧౬

నిరుడు విశాలబుద్ధి నవనీపులు నీ రసపుత్రవీరులుం
గరము తదేకదీక్ష రణకార్యము తీర్చిరి, పాఱిపోయిరీ
తురకలు, రాజమండల విధుంతుదమూర్తివి, యింటిదొంగవై
వఱలితి, చెప్పు నీ కిటుల వాటిలునేని నెవండు దిక్కగున్ ?

౧౭

మొదట తురుష్కసైన్యము సముద్రములోఁ గరటంబురెట్టయై
కదనము చేయవచ్చిన నఖండచమూ విభవాభిరాముఁడై
కదిసిన పృథ్వీరాజు సమఘట్టముకాదని ధర్మబుద్ధితో
నెదిరికిఁ గాలమిచ్చి గడియించెను దుష్ఫలమం చెఱుంగవే

౧౮

అవకాశంబు ఘటించి భూవరుఁ డలక్ష్యస్వాంతుఁడైయుండ,సై
న్య వితానంబు విహారమున్ సలుప నప్పా! నీదు సేనల్, మదీ
య వివాహంబున నీర్ష్యగొన్న నృపసైన్యాళ్గోరి నింజేరి యా
హవముంజేసె,హటాత్తుగాఁబ్రభుఁడుకయ్యంబందుఁజిక్కెన్సుమీ

౧౯

అటు కా దేనిఁ దురుష్క సేనయుఁ ద్వదీయంబైన సైన్యంబదెం
త, టపాకాయలరీతిఁ బ్రేలవె, ధనుర్ధారుల్ మదీయప్రజల్
చటులాగ్నిస్ఫుట బాణముల్ పఱపఁ, బశ్యత్పాలుఁడై పృథ్వీరా
జట రంగంబున దూకియున్న విధి చేయంజాలె నీ రీతిగన్

౨౦

ఇది హిందూనయశాస్త్రసమ్మత సతీస్వేచ్ఛాతనుత్యాగ శ
ర్మద కార్యంబు, పతివ్రతాళి పరమార్థశ్రీప్రదానంబు, శా
రద రాకాశశి చంద్రికామల యశఃప్రాబల్య సంధాయి, సౌ
ఖ్యద మీ భూమిని సాగుమాన మిదె దిక్కై నన్ను రక్షించుతన్-

౨౧

రసపుత్రాన్వయజాత భూవరపవిత్రస్త్రైణ మేనాఁడొ యీ
యసువుల్ నాథుల పేరిటన్ ముడుపుల ట్లత్యంత సంతోషమా
నసలై యర్పణచేసియుండిరి, యదే నాపాలి దైవంబుగా
నసముం గూర్చుత! సాగుమాన మది దిక్కై నన్నురక్షించుతన్

౨౨

సకి తత్పూర్వపరమ్ములైన తరముల్ సాధించుఁ దాఁ బుట్టినిం
టికినిన్ మెట్టినయింటికిన్ యశము వ్యాప్తిన్దేన, నారీ మత
ల్లికి యుక్తంబుగ దేని ధీపతియె పల్కెం గుంభజార్థాంగికై
యకలంకంబగు సొగుమానమది దిక్కై నన్ను రక్షించుతన్

౨౩

ప్రతిహార్యన్వయ చౌహనాన్వయ సుదీర్ఘక్రోధముల్ పండి,భా
రతసౌభాగ్యము బుగ్గిచేసినవి యౌరా ! నాదు జన్మంబుజేఁ
బ్రతిహార్యన్వయ చౌహనాన్వయ సుదీర్ఘక్రోధముల్ మండి మత్
చితి శాంతించుత ! సొగుమాన మది సుశ్రీ కూర్చి రక్షించుతన్.

౨౪

నా సామిన్ దివిలోనఁగాంతు నని పూర్ణస్థైర్యముం జూపి, రా
ణీసంయుక్త రచించిలేఖ నొకదానిం తండ్రికంపించె, ఢి
ల్లీసమ్రాట్సహవాసి చందునకు నా లేఖం బ్రసాదించి. యే
వో సూక్తుల్ వచియించి యాతని సముద్యోగంబు నాలించుచున్

**ప య న ము**

౧

అజమీర్ దేశముఁజొచ్చి రాజభవనాల్ సొంతంబుగా దుల్చి, త
త్ప్రజలన్, నెత్తురుటేర్లుపాఱ నసిధారం జీల్చిచెండాడి, త
ద్గజతాపృష్ఠములందు లొట్టియలపై గాంగేయరాసుల్, మణుల్
రజతంబున్ ధనధాన్యముల్ వివిధచేలంబుల్నిబంధించుచున్

౨

తరలెన్ వీరతురుష్కనేత జయయాత్రన్‌సల్పి యారీతి సం
బరమొప్పన్ బలుఠీవితోడుత మహమ్మద్ఘోరి ఘోరాయుధో
త్కర కంఖాణచయాధిరోహిత తురుష్కవ్రాత మేతేరఁ గా
తర చిత్తంబున మార్గమధ్యజనసంతానమ్ము పర్వెత్తఁగా

3

తరలెన్ వీరతురుష్కనేత తనయాత్రామధ్యమం దార్తులౌ
నర నారీజనులన్, దయారస మమందస్ఫూర్తి రేకెత్త నా
దర భావంబునఁ బిల్చి నిష్కతతి, శ్రద్ధాబద్ధసద్బుద్ధి' యె
వ్వరికిన్ లేదనకుండఁ బంచుచును శుంభద్దానకర్ణుండుగా

౪

తరలెన్ వీరతురుష్కభూపతి కొరాన్‌తత్త్వోక్తు లందంద చూ
పఱు కాశ్చర్యముగొల్పుచుండఁ బయిగంబర్‌నాము లేతేర వా
తెర హుక్కా యొకదివ్యలోకమున గద్దెం దన్ను నిల్పంగ రా
జ్య రమం బెండిలియై స్వదేశమునకున్ సాక్షాద్విడౌజుం డనన్

౫

తరలెన్ వీర తురుష్కనేత తనచెంతన్‌వచ్చు భగ్నాక్షు, దు
ర్భరబాధాపరితప్తమానసుని, వార్తాజీవు, బందిన్ మహా
సరళస్వాంతుని బృథ్వీరాజుఁ గని నిశ్శ్వాసంబ్రజల్ మూర్గిదుః
ఖ రసాంభోధులు భీతికుంభజుని గ్రుక్కల్గాఁ దలల్పంచఁగా

౬

తరలెన్ వీరతురుష్కసేత, కకుబంతవ్యాప్త నానావిధ
స్ఫురిత శ్రీ జయభేరికా పటహ ఖస్ఫోపైక భాంకార, ఘీం
కర ఘోద్య ద్ధసి తోగ్ర హేషిత సుదీర్ఘ ధ్వన్యుదంచ ద్భయం
కర నానావిధ వాహినీజలధి రాకా చంద్రసాదృశ్యమై

౭

నగరం బప్పుడుచేర సైన్యములు శుద్ధాంతమ్ము బీబీ ల్దగ
ద్దగిత స్వర్గమణీ విభూషలవి సద్యఃకాంతులం జిమ్మఁ జి
ర్నగవొప్పన్ నుతిచేసి రుత్సుకత మీఱన్ దోఁచెఁదత్కాంతులన్
మొగి నైసర్గిక దేవి తా నరువుసొమ్ముల్ పెట్టుకొన్నట్లుగా

౮

తమనాథుల్ పరసీమపై కరిగి, యుద్ధం బందు గెల్పొంది, దే
శము హస్తామలకం బొనర్చిరి తురుష్కస్వామికి న్నాఁడు ప్రా
ణములన్ జాత్యుదయంబుకై యిడిరి పూర్వస్థైర్యముంజూపియు
ల్లము రంజిల్లదె వారి కందులకె యల్లాపేరు మ్రోఁగెం బురిన్

౯

అది సామాన్యమె తానము న్వదలి యన్యస్థానముంజొచ్చి, పే
రొదవన్ యుద్ధముచేసి గెల్చుట యటం చూరూర గోరీమహ
మ్మదు పేరన్ విపులోత్సవంబులను బ్రహ్మాండమ్ముగాఁ జేసి ర
య్యది యిస్లాముమతంపురొట్టెలకు నాజ్యంబయ్యె నారీతిగా

౧౦

గోరీయంతట స్వీయసైన్యముల రక్షోవీర్యముం గార్యదీ
క్షా రమ్యత్వము నైకమత్యమతవిశ్వాసంబులన్ మెచ్చి, బల్
హీరాలన్ ధనరాసులన్, పదవులందెచ్చింపులన్ నాఁడు 'మా'
గారా మొప్పఁగ వారిఁదన్పి పనిచెన్ శ్లాఘ్యాత్ముఁడై తత్పురిన్

౧౧

ఆహారంబుకు గోరఁ డాతనువుపై నావంతయున్ శ్రద్ధ లో
నూహింపం డదియేమికారణమొ ధర్మోద్దేశమున్వీడి గో
రీ హింసం దలపెట్టి టప్పున రణోర్విం దన్ను వంచించుటన్
బాహావీర్యము వ్యర్థమౌట మదిలోనన్ రాజు యోజించునో

౧౨

తనసేనాపతి లోన మచ్చరముచేతన్ హాహులీరాయఁ డా
యనిలో నున్నటులుండి శత్రువుల పైపై, యున్న లోపంబులె
ల్లను గోరీ కెఱిగించి మమ్మెదిరి యుల్లాసంబుతోఁ బోరి గె
ల్పును సాధించునె హాయటంచుఁదనలో మోసమ్ము నూహించునో

౧౩

తన జాత్యేకత వమ్ముగాఁగ జయచంద్రశ్రీమహారాజు నా
తనికిం దోడయినట్టి సైన్యపతి సర్దార్ హాహులీరాయడుం
దనమాత్రం బరదేశముష్కరుల హస్తన్యస్తముంజేసి నీ
ళ్ళను వేడ్కన్ విడువంగఁజాలి రని యుల్లంబందుదుఃఖించునో

౧౪

తనతో నా రసపుత్త్రపాలన సమాప్తంబై మహాభారతా
వని సప్తానుమహమ్మదీయ శక సువ్యక్తంబుగాఁగం దపో
ధనులై హైందవు లట్టిశక్తి మరలన్ స్థాపింతురేమో యటం
చును జిజ్ఞాసను నిశ్చలత్వము భజించున్‌గాక వేఱు న్నదే!

౧౫

తన తాతైన యనంగపాలుఁడు ద్విధా తద్రాజ్యముం జీల్చి యి
చ్చినఁ దానుం జయచంద్రుఁడుం గలిసినిశ్చింతన్ సదాపాలనం
బును జేయంగను వీలగుం గదటె! ఆ పుణ్యుండు నాకిచ్చె నే
లను నే నిట్టిదిగా ఘటించుటకొ చెల్లా యంచుఁ లోఁగుందునో

౧౬

ఒక రాజన్యుఁడు జాతికిన్ మిగులఁ దా నున్మత్తుఁడై చెప్పరా
ని కళంకంబును దేఁగ దత్క్షణము వాని జీల్చి చెండాడి జా
తికి నైనట్టి యపప్రథం గడిగి కీర్తి న్నిల్పి పేరొందు పా
లక విద్యాధరు లీమహాస్థలిఁ గలారా యంచు దర్కించునో

౧౭

ధనరాసుల్ మణిరాసులం గొని మహాదర్పంబునం వీరుపో
యునఁ బోనిమ్ము మతమ్ముకై యొకటియై యెంతేని దోషమ్ము చే
సినఁ గానిమ్ము స్వరాజ్యము న్నిలుపనీ జెండాడడనీ యన్యులన్
మనవా రిన్నిటఁ గొన్ని నేర్చుకొన రేమా యంచు యోజించునో

౧౮

అలనాఁ డాగజనీమహమ్మదు సురాష్ట్రాంత ప్రభాసాఖ్యని
ర్మల తీర్థస్థిత సోమనాథవసతిన్ మాయించి హిందూమహో
జ్జ్వల తేజోమయ లింగముంగొని పుత్రాస్థన్ ముక్కలంజేసి యా
పలుకుల్ గట్టెమసీదుమెట్లుగ నికేపాటౌనొ యుంచెంచునో

౧౯

తన యీ జీవితమిట్టులం గడపుటం దప్పేమొ యొప్పేమొ యే
పనికై యిచ్చట నిట్టులం దనువునిల్పం బూనెనో యేమొ యె
వ్వనికిం దోఁచును గాలమానమున సవ్యంబై గడెల్ గంటలున్
దినము ల్సాగుచునుండె గోరిపురి పృథ్వీరాజు యోజించుచో

## పశ్చాత్తాపము

౧

అదిజయచంద్రుహర్మ్యము,మహాకవిచందుఁడుఘోటకంబునుం
డి దిగెఁ దదాస్యకంజము మణిద్యుతితో,ద్యుమణి క్రమాస్త భా
న దశను ఖిన్నరూపముఁ గనంబఱచెం, గని ద్వారపాలుర
య్యది యెఱిఁగించి, భూవరుని యాజ్ఞను బంచిరి వానిలోనికిన్

౨

కనెజయచంద్రుఁజందుఁడుప్రఘూణమునం దొకయున్నతాసనం
బున నుపవిష్టుఁడై తనకపోలముపైఁ గరముంచి, యోచనన్
మునిఁగినవాని శాంతరసమున్ మఱి వీరభయానకంబులున్
దనముఖమందు ముప్పిరిగొనం దలపోయు కనూజివీరునిన్

3

ఏ రణభూమినో యరులనెల్లను దాఁ దునుమాడి, కార్యసం
భారము నెట్లుమోయఁగ సమర్థుఁడనౌదునొ యబ్బ యంచుఁ దా
నూరుపు వెచ్చగా వదలుచున్నటు లా జనభర్తతోఁచె, నా
తీరుననున్నవాని వసతిం గవిచంద్రుఁడు చొచ్చి నిల్వఁగా

౪

క్షణమటుసాగఁ జందుని విశాంపతి యారసి, లేచి చివ్వనం
బ్రణతు లొనర్ప దగ్గఱకురాఁగఁ గరంబులఁ గ్రుచ్చి కౌఁగిటం
దొణకిసలాడు బాష్పతతితోఁ గవి, భూపుని యంస పీఠిఁ బె
ల్లణఁచి కృతాసనస్థుఁడయి యాతనితోడుత గద్గదంబుగా

౫

అయి యనుకోవుగా మఱి వయస్సునఁ జెల్లినవాఁడ నౌట నే
దయినను బొల్లుమాటనఁగ, నైనను మించిన దేమిలేదు, మే
లయినను గీడెయైనఁదుది నారసి పోవఁగ వచ్చినాఁడ, నే
దయినఁ బ్రమాద మిప్పుడు రవంతయుఁ గల్గదుగాదె తమ్ముఁడా

౬

ప్రథితుఁ డనంగపాలుఁడు శుభంబుకొ చెడ్డకొ స్వీయరాజ్యముం
బృథుతరశక్తిమంతుఁ డగు పృథ్విమహీపతి కిచ్చెఁ, జూడఁగా
విధి హితమ ట్లతం డనుభవింపఁగఁ దోఁచెడు, వానితోడి వే
ఱధిపతి వాతఁడుంబలె సమంచితబంధువ వీవునున్ సరే !

౭

ఇది మన మాతృదేశముసుమీ మనకెంత విరోధముండినం
గదనము చేయవచ్చును సగర్వముగా, నటుగాక యీ మహ
మ్మదుని, మతప్రధానుని నమాంతముగాఁ బలిపింతె, జాతియే
తుదకు నశింప నీ కొఱవితోడుత నీ తల గోకికొందువే ?

౮

మత మనుపేర వారలు సమైక్యము నొందిరి, దోఁచి రెంతొ భా
రతమును సర్వనాశముగఁ, బ్రాభవమందిరి, నీ వెఱుంగు దా
మతముల పిచ్చితోడుత సబక్తజినున్ గజనీమహమ్మదున్
గత మదియేల నైక్యము పొకాలెనుమీ రసపుత్రజాతికిన్

౯

అమరిక నొక్కమాటపయి నందఱు నుండుట సఖ్యబుద్ధి ను
త్తము, మట వైరమున్నఁ, బరధాటులువచ్చిన నేకమౌట, మ
ధ్యమ మగు, నావిరోధికి సహాయముచేయుటయుద్ధమందు నీ
చము, పరసైన్యముం బిలిచి స్వాగతమిచ్చుట నేమియందురో !

౧౦

ఇదిగొ ! త్వదీయపుత్త్రిక లిఖించిన యుత్తర, మామెపంపఁ ద
ప్పదుకద రాక, చౌహనునిపట్టపుదేవి, మదీయపుణ్య సం
పద, అజమీరు ఢిల్లిని శుభంబుగ నేలినతల్లి, యెన్నిటం
గొదవను మాట లేనిసతి కోడఱికంబునఁ. దీసికొమ్మిదే !

౧౧

ఇతఁ డిదె పృథ్వీరాజు కయి యేగును, ప్రాణములిచ్చు వానికై
సతతము తన్మహీపతి విచారముతో నొటనుండెనో, శుభ
స్థితికిఁ దిలోదకాలిడి ప్రతిక్రియచేయక యూరకుండఁ డా
క్షితిపతిఁ జేరి కార్య మవశేషముఁ దీర్చెదఁ బోయివచ్చెదన్

౧౨

ఆతనిగృహానఁ దిండి తిని యాతని పంచనె పండి, వానిపైఁ
గృతిని రచించి, సార్థకత నింతగడించిన యీ శరీరమా
పతిదియ కాక వేఱగునె భవ్యయశస్సున కీ యొడల్ సమ
ర్పితము ఘటింతు నా ప్రతిన రీతి యిదే జయచంద్రభూపతీ

౧3

అనివచియింప నంతయు, మహావిపదబ్ధి మునింగి రాజు ప
ల్కను దన నోరురాక వెతగాఁ దుదిదాఁకను లేక చూచి, యం
దును సుత'సాగుమానము,విధుంతుదమూర్తివటంచుఁదన్ను ప
ల్కిన విధ మెంచ నశ్రులురలెం గన నాత్మజ దివ్యవాక్కులన్

౧౪

ప్రతిహార్యన్వయ చౌహనాన్వయ సుదీర్ఘక్రోధముల్ మండి నా
చితి శాంతించుత మన్న పల్కులఁ బఠించెం దోడనే యశ్రువుల్
పతితంబయ్యెను 'మండి'మాటపయిఁ జల్లార్పంగ నీపాటి నీ
పితృదుఃఖాశ్రులుచాలవేయనుచుఁద్రిప్పెం చందువైపాస్యమున్

౧౫

సుకవివరా! యటన్న యొక సూక్తియ వీచెను బైరగాలిగా,
నొకవిధమైన తేటతన మొప్పఁగ నానన మెత్తి భూమినా
యకు జయచంద్రుఁగాంచెఁ గవి, యంతట నీక్రియ రాజుపల్కె నే
నొకటి తలంప దైవమది యొక్కటి తాఁ దలఁచెన్ సుమీయిటన్-

౧౬

తన మనుమండనై ధరణిఁ దాల్పఁగ శక్తినిగల్గి పృథ్వీరా
జ నృపుని కంటెఁ బెద్దనయి సర్వ మెఱింగిన నన్నువీడి, యా
జనపుఁ డనంగపాలుఁ డిటుసల్పునె ఢిల్లిని వానికిచ్చి, యే
మని తలయెత్తుకొందు, నసమర్థునిగా నను లోకమెంచదే!

౧౭

అది సహియింపనేర్తునె, మహావిభవంబునఁ బృథ్వీరాజు పే
రొదవఁగ ఢిల్లిపీఠముననుండుట; ధర్మవు కాదటంచునుం
గదనము తప్పదంచు, సుజనక్రమపద్ధతికా దటంచు, స
మ్మదముగ దేశమున్ సరిసమానముగా విభజింపు మంచునున్.

౧౮

తిని తిరుగాడు మానవతతిన్ నడిసంద్రములోన ముంచెదే
యనుచును రాజపుత్రకులమంతకు నాశనమున్ ఘటించెదే
యనుచుననంగపాలుమఱియాడుచునెన్నియొపల్కిపల్కి యుం
కను ఫలితంబు గాన కలుకందలపోసితిఁ దీవ్రదృష్టినై

౧౯

ప్రియవచనంబు శాంతమరరే భువి నెంచరు లోకులెప్పు డం
తియె మఱికాదు తద్వచను దేబెగఁ జూతురు, కార్యశీలతన్
జయముగడింపఁగా వలయు క్షత్రియధర్మమ యద్ది యంచు నా
పయిఁ దలపెట్టితిన్ జరుపఁబ్రప్రథమంబుగ నొక్క యాగమున్

౨౦

సరసత నెంచి వచ్చిరిదిశా వల యంబుననుండి మేటిభూ
వరులు మదిచ్ఛ గైకొని యవారితవిక్రములైనవారు, తా
నరియని పృథ్వీరా జొకఁడు వ్యక్తముచేసెను రాక, యప్పుడే
జరిగె సుతాస్వయంవర లస ద్విపులోత్సవ మా సభాస్థలిన్

౨౧

కొఱయయివాని రాక తలగొట్టినయట్లయినాకుఁ దోన ము
మ్మరమగుకోపబుద్ధి నవమానముచేయఁగనెంచి వానిసుం
దర తపనీయవిగ్రహము ద్వారముచెంతన సేవకుండుగా
నెఱపితి వచ్చినట్టి యవనీపులు సంభ్రమచిత్తులై కనన్

౨౨

కనకమయ స్వదేహరుచి క్రాలఁగ నా సభకున్ మదీయజీ
వనఘనమూర్తి అంచితతపః ఫలరూపము మత్కులైకనం
దనమహిజంబు యౌవనసుధాపరిపోషితవల్లి వచ్చి ని
ల్చెను రతివోలెఁ జెంపలకుఁ జేరెడు కన్నులతల్లి యంతటన్

౨3

ఒకఁడునులేఁడె మన్మథుఁ డహో యనిరాజులు లోఁదలంపదా
మకమును జేతఁబూని సుకుమారి యొయారముమీఱ మారుకై
చకచకసాగి ద్వాఃస్థిత విశాంపతి విగ్రహమందు వైచె నే
మొకొ యనితోడి రాజులు భయోత్సుకతేర్ష్యలఁ జూచుచుండఁగా

౨౪

అది యొకచిత్రమై యచట యాచకవేషపుమబ్బునన్ నిర
మ్మదమొ యనంగ వచ్చి మహిమన్ నిజరూపము పృథ్విరాజుగా
సుదతి కరంబుఁ గొంచుఁ జనెఁజోద్యముగాహయమెక్కి తా వశం
వదగ రహింపఁగా మును గవాంపతి రుక్మిణిఁ గొన్నరీతిగా

౨౫

అతనికి సాయమై యటుల యాచకవేషము లంది బైటదీ
నతఁ దిరుగాడు మూఁక నటనం దమకత్తులదూసి యోధులై
గతగత దౌడుద్రోఁత లొలుకన్ హరులెక్కి మహోగ్రతన్విశాం
పతివెనువెంట నేగిరి సుమా అపు డేను మహోగ్రసేనలన్

౨౬

పనిచితివెంట వారిపనిపట్టఁగ నొక్కఁడు చిక్కకుంట నా
మనుపటి క్రోధవహ్ని మినుముట్టఁగ నాఁటి మహాజ్యధారచే,
మనమున వానిఁ గూల్పఁగను మార్గమునెంచుచు స్వీయశక్తిచా
లని గతి నెంచుచున్ దినములన్ దొరలించుచు వేచియుండితిన్

౨౭

నిరుడు బఠానువంశజుఁ డనిన్ జరిపెంగద గోరి, నాఁడు నా
బరువడి తీఱెనంచుఁ దలఁపన్ వృథయయ్యెగ్గనతండె చిక్కి సం
గరమునఁ, బృథ్వీరాజు బ్రతుకన్ విడిపించెను ధర్మబుద్ధియై
మరలె నతండు స్వీయపురమార్గముఁ బట్టి తురుష్క సేనతో

౨౮

అతనిని రమ్మటంచును సహాయ్యముచేసి జయంబుఁగూర్తునం
చతనికిఁ గమ్మపంపుటకు నందరితోడ సభాంతరాన నా
మతమును జెప్పితిన్ భరతమాతకు జాతికి మాకు మీకునుం
బతనముకల్గు నంచుఁ దమభావములన్ వెలిబుచ్చి రందఱున్

౨౯

అది యహితంబునాకు నెటులైనను దప్పదు పృథ్వీరాజు గె
ల్చెదనని యంచు ఢిల్లిపుర లిప్సువునై మదినెంచితిం గవీ!
మొదటనుబల్కి యా సమయమున్ దిగ్రమింగిననవ్వరేజనుల్
కుదరకయున్నతిక్క యలఘుం డగు మీ యజమీరునేతకున్

30

కదనముచేయరమ్ము జయకాంతనుబొందుము రమ్ము ఓమహ
మ్మదుసులతాను! సైన్యముసమస్తమునిత్తును నీకు, వచ్చి సం
పదలకొటారు ఢిల్లిని శుభంబుగగెల్వుము పృథ్వీరాజుదు
ర్మదుని మదీయవైరిఁ బరిమార్పుము క్రోధముతీర్చుకోగదే!

౩౧

అని ఘటియించిలేఖను మహమ్మదుగోరికిఁ బంపితిఁ గసుమీ !
మనమున, నీగతిం బనికిమాలిన చేఁతకు, దారితీసితిం
ధనము, మనమ్ము దేశమును దగ్ధముచేసితి వైరమెంచి, త
ప్పును సరిదిద్దుకొందుఁ బరిపూతహృదబ్జము విప్పి చూపితిం.

౩౨

అనితర శౌర్యధైర్యవిభవాస్పదమౌ రసపుత్త్రశక్తి చ
చ్చినది కసూజిరాజునకు, జీవముతోడి శవం బితండు, జా
తిని నిలువంటఁగోసిన యధీరుఁడు, పాపి, కలంకి, యెన్ని నే
ర్చినఫలమేమి యిన్నిటఁ జరిత్రను మ్రోగును వీనిలోపమే.

౩౩

అని జయమంది రాజ్యరమనందుటొ, ప్రాణమునొడ్డి స్వర్గమం
దున నివసించుటో గదలె తోషముఁగూర్చెడునాకు, జాతి కే
పనికినిజాలకే పిరికిపందగ నన్యునిఁ బిల్చుటెంత తీ
రని యఘమో కదే ! జనని అంపపుఁగోఁతలఁ గోసితింగదే !

౩౪

అసలు విరోధ మింతటిది యంతయు, పట్టఁగరానిదై యిటుల్
విసమయిపోయె, పట్టుదలవీడకపోతిగ, నెట్టివానికిం
వసుమతిఁ గ్రోధభావము లనంతములైన, వివేకశూన్యుఁడై
మసలుగదే ! మదీయగతి మర్దితుఁ డన్యుఁడు వేఱుచేయునే ?

౩౫

కటకట నాఁడు నాసుతసుఖంబును గోరినవాఁడఁగాను, నే
నటు లొనరించియుండిన నహా! జగదేక మహాపరాక్రమున్
దిటమగునల్లువాని మదధీనముగా ఘటియించి, లోక వి
స్ఫుటముగ రామరాజ్యము నృపుల్ కొనియాడఁగఁజేసియుండనే?

౩౬

ఇది విధిసేఁతయై మతివిహీనతఁ జేసితి నిన్ని నాదుపు
త్రి దివికి నేగినట్టి సుగతిన్ మదినెంతును - నాదుప్రేమ కా
స్పదమయిభర్తఁగొన్న నిముసంబుననుండియుఁ బోయినన్నుబల్
వదలినతల్లి కంట మెదలన్ జలతర్పణమున్ ఘటించెదన్.

౩౭

తుద కిటు రాజసంతతి విధుంతుదమూర్తి వటంచుఁ బల్కి, నా
హృదయముఁజీల్చి సత్పథ మహీనతఁ బొందఁగ, బోధచేసి, త
ద్వదనముచూపకే దివికిఁ దాఁ దనభర్తనుగూడనేగె, నా
ముదితకు భౌతికాశ్రుకణముల్ వెదచల్లుదు నాత్మశాంతికై.

౩౮

ఇదియె దృఢప్రతిజ్ఞ, గడియించినదోషము క్షాళితంబుగా
సదమలబుద్ధి హైందవయశస్సును నిల్పఁగ బద్ధకంకణుం
డిదె నిలిచెం గవీ! శిరమునెత్తి యిటం గనుమోయి, వీని కిం
త దయ దలిర్ప దీవన యథావిధి నీయఁగదే మహామతిన్.

౩౯

ఇది సుదృఢప్రతిజ్ఞ, వినవే, రసపుత్త్రభుజైక ఖడ్గసం
పద రుచిచూపెదం బిరికిపందలు శత్రువులంచుఁజాటి చె
ప్పెద సమరంబుమూలమున భీరుతురుష్కులు స్వీయసీమకుం
గదలఁగ హైందవావని నఖండముగా జయభేరి మ్రోగఁగాన్.

౪౦

అతిసుదృఢప్రతిజ్ఞ వెలయం బెఱవారినిజంపి నెత్రులా
మెతలుగ నిత్తు ఢిల్లి, కజమీరు కనూజుల కింకఁ బృథ్విరా
ణ్మతి మఱి శాంతినొందఁ బటుబాహుబలైకజయాన, జాతి, నా
మతియు సుఖింప వైరమను మాటయెలేక, సమైక్యమొందుచున్.

౪౧

జయముల భించినన్ దశదిశావలయంబుగ నేకఖండమై
భయ రహితంబుగా జనని ప్రాభవమందుత, లేకిటం బరా
జయము లభించెనేని, కడసారి నమస్కృతిచేసి పోరి, య
వ్యయమగు స్వర్గసంపద ధ్రువంబుగఁ బొందెద వీరకోటితో -

౪౨

తలఁచితిఁ బృథ్విరాజరణదర్పముఁ ఓర్పఁగ, నద్దియయ్యె, నా
తలఁపుచిగిర్చె నేఁడు పరధాటికి నా తలనొడ్డిపోరెదన్
నిలుపుదు జాతిగౌరవము, నిశ్చయ మిద్దియ రాజ్యతంత్రముల్,
మలుపులునేర్పఁజాలిన యమాత్యుఁడ వేమిఘటింపుమందువో!

౪౩

సంవృతరాజసన్నుతుఁడ! చంద! త్వదీయసునామ మున్న దన్
సంవరమాజి వక్రగతి నామముక్రిందను జేర నంచు, నే
వంవిధవక్ష్యమాణజనవల్లభు శ్రీ జయచంద్రు, భూపతీ
నాంవరుఁ జూచి చందుఁడు మనఃపరిపూర్తిగ బల్కనెంచి, తా

౪౪

చెవిలో నేమియొచెప్ప రాజు తలనూచెం జందుఁ డాపైన భూ
ధవునాజ్ఞంగొని వత్తుగా యఁను చళిందద్వారమున్వీడి, తో
నవనీపుండును వచ్చుచుండనిలుమయ్యాయంచునశ్వంబుఁ బూ
న్చె వినంగా జయహింద్‌నినాదములు వీచెన్‌గాలితోపాటుగా.

## వ్యూహము

౧

ధనువుం గానకఁగఁ దెచ్చినట్టి జయచంద్ర శ్రీ మహారాజు దూ
తను, జందున్ బహుమానపూర్వక సుహృద్వ్యాపార మేపారఁ దో
డ్కొని యఁభ్యంతరమందిరంబునకు, గోష్ఠుల్‌సల్పె గోరీప్రభుం
డనురాగాంబుధి దేలి యుద్ధఃషయన్యస్తాత్ముఁడై యత్తఱిన్.

౨

అటనున్నట్టితఱిన్ రహస్యముగఁ దాసైన్రవాసి పృథ్వీశు చెం
గటకుం గమ్మను జందుపంపె, బహుజాగ్రద్దృష్టి నాత్మీయుచే -
వటత్తాటంపు ధనుఃప్రదర్శనముతోఁ బృథ్వీశు ప్రాణాలు తీ
యుట కేర్పాటయె, చందుపన్నుగడలో నున్నట్టి తీరెట్టిదో !

3

ఒకవై పఘ్ఘను వీరకోటి నిలువన్ వ్యూహంబుగా, జూడ నిం
కొక పార్శ్వనఁ బురీతురుష్కవితతుల్ యుక్తఁబుగానిల్వ,నిం
కొకభాగంబున జంటికందుపులతో యోషిద్వ్రజం బొప్ప ను
త్సుకతం దానొక యున్నతాసనముపై శోభిల్లె గోరీయటన్.

౪

సభ నిశ్శబ్దము, పృథ్వీరాజు నిరుపార్శ్వమ్ముల్ గడుంబట్టి వీ
రభటుల్ తోడన తెచ్చినిల్పిరి, కృతప్రారంభుఁడై గోరి యా
ప్రభుతో నిట్లనియెన్ ససంభ్రమముగా, ఖాయీ కనన్‌గొప్పదం
ట! భువిన్ నీ విలువిద్దె వచ్చితిమిఁ చూడన్, జూపి పేరొందుమా!"

౫

"అజమీరుదేశ ప్రాగద్రి భానూదయా!
ప్రజితారిలోక నీరాజితాంఘ్రి ద్వయా
కవిచం దభీష్ట సత్కార్య పారంగతా!
అవినీతి తూల ఝుంఝూనిలోత్తేజితా!
రసపుత్త్ర వీర నిర్వ్యాజ తేజోమయా!
అసమాన శబ్దవేధ్యస్త్ర విద్యాశ్రయా!
ఇది వేళ, యస్త్రసాహిత్యసాఫల్యమున్
మదినెంచి కొట్ట జన్మంబు సార్థక్యమౌ.

విలువిద్దె నీశబ్దవేధిఁ జూపింపవే
తిలకించి చావ నీ దేశమేతెంచితిన్."
అనెడు కమ్మను మదినట్టులే తలఁచుచున్
మననంబుచేయుచున్ మఱిమఱి తలపోసె.

౬

అజమీరుదేశ ప్రాగద్రి భానూదయా!
అనుమాట పూర్వవాసనల రేఁప,
అసమానశబ్దవే ధ్యస్త్ర విద్యాశ్రయా!
అనువాక్కెదో రహస్యమును దెలుప
మదినెంచి కొట్ట జన్మంబు సార్థక్యమౌ
అనురీతి త్రోవ యెయ్యెదియొ చూప
కవిచందభీష్ట సత్కార్య పారంగతా!
అనువాణి యుక్తిలోతును వెలార్ప
తనదు కార్యావశేష తత్త్వము నెఱింగి
తనదు చందుని జాతితత్త్వము నెఱింగి
తనదు విధ్యుక్త ధర్మతత్త్వము నెఱింగి
మీఁది కార్యంబు నెంచె నజ్మీరునేత.

౭

తన కధర్మము ఘటించినవాని నదనున
గెలువంగ నొక ప్రతిక్రియఁ దలంచి,
తన కసాధ్యంబైనపని సుసాధ్యంబుగా
నొనరించు స్వీయమిత్రుని దలంచి,

తనతోనె తనవిద్య మునిఁగిపోవుచుఁ గొంత
సార్థకంబైన నాస్థను దలంచి
తనదేశమునకుఁ దా నొనరించునది యింత
కంటెను వేఱు మృగ్యమని తలఁచి
అంతకునుమున్నె గోరి తన్నున్న పలుకు
బడి తెలుఁగును గడు పసిపట్టి తలఁచి
ఏదియెటులైనఁ గడసారియే గద యని
మీఁది కార్యంబు నెంచె నజ్మీరు నేత.

౮

అతనినోటనుమాట యదిచెవిం బడగానె
తలత్రుళ్లి నేలఁ జిందులను ద్రొక్క
నటుపైన భయముతో నావలావల తురు
ష్కులు మండిపడుచుఁ గత్తులను దూయ
దనపనుల్ ముగిసి కర్తవ్యమ్ము నెఱిగింపఁ
గవిచందుఁ డపుడు దగ్గరకుఁ రాఁగ
నుభయులున్ మాతృాణ మొకయింత తీర్చి, పూ
ర్ణప్రేమ నాత్మార్పణంబు చేయ
ధరను సర్వ మంతటితోడ, సరియయినటు
లేమొ యాలాపనలు రాఁగ, హృదయ మపుడు
పనులు సాగింప నుత్తలంపడఁగ వడిగ
మీఁది కార్యంబు నెంచె నజ్మీరు నేత.

౯

ఒక సుక్షేత్రమునందు సస్యతతి దుర్యోగంబునంజేసి చా
వక యేపొందక నిల్చియుండ, నట దైవవ్యాజ మొప్పన్ బలా
హక దివ్యోదయ లబ్ధ వర్షజల భాగ్యంబిచ్చి, తత్సస్యవృ
ద్ధికిఁ దోడ్తో నటహేతుభూతమగు సిద్ధింజూపెఁ గాలంబహో !

౧౦

తనదు తలపోఁతలన్ని సత్యములుగాఁగ
మాతృదేశ ఋణమ్ము ప్రేమమ్ము మీఱఁ
దీర్చి యాత్మార్పణము చేసె, ధీర పృథ్వి
రాజు, చందుఁడు రాజుమార్గమున నడచె-

౧౧

వీరస్వర్గ సభాసువర్ణవిలసత్పీఠంబుపై వెల్గెఁ బృ
థ్వీరాజేంద్రుఁడు, ధర్మపత్నియుతుఁడై దివ్య ప్రబంధోర్జిత
శ్రీ రాజత్కర పంకజుండయి కవిశ్రీ చందుఁడొప్పన్, మహా
వీరుండై, జయచంద్రభూమిపతి నవ్వింపంగ శశ్వత్ప్రభన్.

ఇతి శివమ్

జూపిటర్ ప్రింటింగ్ ప్రెస్, గుంటూరు-౭

**Check List**

| | | | |
|---|---|---|---|
| **Book Number** | SVMRO1A201 | **Date** | 17/8/2022 |
| **Front Cover** | yes | **Back Cover** | yes |
| **Blank Pages** | 68, 98, 100, 144, 149, 181 | | |
| **Missing Pages** | NO | | |
| **Prepared By** | Sruthi | **Cutting By** | Sruthi |
| **Scanned By** | P Bragathi | **Pages** | 193 |